# చందమామ

సంపుటి 103 జూలై 2000 సంచిక 1



ఈ సంచికలో...



ఈ నెల విశేషాలు



పరంధాముడి మోక్షం (బేతాళ కథ)



కర్ణభేది పాటగాడు



పిశాచాల పగ



భారత సంస్కృతి చరిత్ర

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K Press Pvt. Ltd., Chennai–600 026 on behalf of Chandamama India Limited, Chandamama Buildings, Vadapalani, Chennai–600 026. Editor: Viswam

దూర తీరాల్లో వున్న

## మీ వాళ్ళ కోసం

ముచ్చటగా ఇవ్వతగ్గ
ఏకైక బహుమతి



# చందమామ

వారిభాషల్లో
వారితో మాట్లాడే
చందమామ ఒకటివ్వండి!

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీషు, గుజరాతీ, హిందీ, కన్నడ
మలయాళం, మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు

అక్కడెక్కడో దూరంగా వున్న మీ వాళ్లకు
చందమామ వెన్నెల చల్లదనం కబుర్లు పంపండిక!

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్ని దేశాలకు
పన్నెండు సంచికలు రూ. 900

మన దేశంలో బుక్ పోస్ట్ ద్వారా
పన్నెండు సంచికలు రూ. 120

సొమ్ము డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గానీ మనిఆర్డరు ద్వారా గానీ
చందమామ ఇండియా లిమిటెడ్ పేరిట ఈ క్రింది
చిరునామాకు పంపండి:

PUBLICATION DIVISION
CHANDAMAMA INDIA LIMITED
CHANDAMAMA BUILDINGS, VADAPALANI, CHENNAI-600 026




సంపాదకుడు
విశ్వం

ఉత్తర ప్రత్యుత్తరాలకు:
చందమామ మేగజైన్ డివిజన్
చందమామ బిల్డింగ్స్
వడపళని, చెన్నయ్ - 600 026
ఫోన్/ఫ్యాక్స్: 4841778
4842087
ఇ. మెయిల్: Chandamama@ vsn lcom

ముంబాయి కార్యాలయం
2/B, నాజ్ బిల్డింగ్స్
లామింగ్టన్ రోడ్,
ముంబాయి-400 004
ఫోన్: 022-388 7480
ఫ్యాక్స్: 022-388 9670

అమెరికాలో
విడికాపీ $2
సంవత్సర చందా $20
సొమ్ము పంపవలసిన చిరునామా:
ఇండియా అబ్రాడ్
43 వెస్ట్ 24 స్ట్రీట్
న్యూయార్క్, ఎన్.వై 10010
ఫోన్: (212) 929-1727
ఫ్యాక్స్: 212-627-9503



సంచాలకులు

చక్రపాణి. బి.నాగిరెడ్డి

# అందరం భారతీయులం!

తల్లితండ్రులు పాశ్చాత్యదేశంలో స్థిరపడడం వల్ల, చిన్నప్పటి నుంచి అక్కడే పెరిగి మనదేశానికి తిరిగి వచ్చిన ఒక భారతీయుడికి ఎదురైన వింత అనుభవం ఒకటి ఇటీవల పత్రికలలో చోటుచేసుకున్నది.

అద్భుతమైన భారతీయ సంస్కృతీ వారసత్వం గురించి చదవడం వల్ల ఆయనకు మనదేశం అంటే వల్లమాలిన అభిమానం. తల్లితండ్రుల మరణానంతరం; వాళ్ళూ, తానూ కూడబెట్టిన ధనంతో సంక్షేమ పథకాలు చేపట్టాలన్న ఉదాత్త ఆశయంతో ఆయన భారత దేశానికి వచ్చాడు.

ఆయన భారత రాజధానికి చేరగానే అక్కడివారు, ''మీరు ఫలానా రాష్ట్రానికి చెందిన వారన్న విషయం మరిచిపోకండి. మీ సంక్షేమ పథకాలను అక్కడినుంచే ఆరంభించండి,'' అన్నారు.

ఆయన సొంతరాష్ట్రం చేరుకున్నాక, అక్కడివారు, ''మీరు ఫలానాప్రాంతానికి చెందిన వారు. అక్కడినుంచే మీ పథకాలు ప్రారంభించాలి,'' అన్నారు. అంతేకాదు, మీరు ఫలానా మతానికి చెందినవారు; ఫలానా కులానికి చెందినవారు; శాఖకు చెందినవారు. మీ సంపద మీ వాళ్ళ సంక్షేమానికే ఉపయోగపడాలి; అని సలహాలు గుప్పించారట!

ఆయన తాను కలలుగన్న ఇండియాను కనుగొనలేకపోయాడు. ఆఖరికి హృదయభారంతో ఇండియాను వదిలివెళుతూ, తెచ్చిన ధనాన్ని యునెస్కోకు విరాళంగా ఇచ్చాడట! విచిత్రమైన ఈ పరిస్థితికి ప్రత్యామ్నాయం ఏమిటి? మనం కుల, మత, ప్రాంత, రాష్ట్ర దురభిమానాలకు అతీతంగా మసలుకోవాలి. అందరం భారతీయులం అన్న భావం మనలో వేళ్ళూనాలి.

ఇప్పుడు మనదేశంలో కొన్ని కొత్తరాష్ట్రాలను ఏర్పాటు చేస్తున్నారు. పాత రాష్ట్రాల నుంచీ కొన్ని పట్టణప్రాంతాలు కొత్త రాష్ట్రంలో కలవడం కొందరికి ఇష్టంలేదు. మన రాష్ట్రం నుంచి పొరుగురాష్ట్రంలో కలవడం అంటే దేశం నుంచి విడిపోవడం కాదుకదా! పరిపాలనా సౌలభ్యం కోసమే చిన్నరాష్ట్రాల ఏర్పాట్లు అని గుర్తించాలి!

మనమందరం భారతీయులం అన్న భావంతో దేశప్రగతికి కలిసికట్టుగా పాటు పడవలసిన బాధ్యత మన అందరిమీదా ఉన్నది!



# చందమామ కబుర్లు

## అందమైన మీ కొత్త శత్రువు!

మీస్నేహితుడు తరగతికి సెల్‌ఫోన్ తెస్తున్నాడు కదా అని మీరూ దానిని కొనిపెట్టమని మీ నాన్నను అడిగారా? అలా అడిగివున్నట్టయితే ఇక దాని ఊసెత్తకండి. మీ స్నేహితుడు మిమ్మల్ని అపార్థం చేసుకోడు అనిపిస్తే-సెల్‌ఫోన్ వాడొద్దు అని చెప్పండి. ఎందుకంటే, సెల్‌ఫోన్లు ఉపయోగించేపిల్లలు బ్రెయిన్‌ట్యూమర్ లాంటి వ్యాధులకు లోనయ్యే అపాయంవుందని శాస్త్రవేత్తలు అభిప్రాయపడుతున్నారు. ఈ విషయంగా పరిశోధనలు జరుగుతున్నాయి. అయినా, మన జాగ్రత్తలో మనం ఉండడం క్షేమం కదా!



## మోనాలిసా చిత్రకారుడు

పదిహేనవ శతాబ్దానికి చెందిన ఇటలీ దేశ చిత్రకారుడు లియొనార్డోడావిన్సీ చిత్రించిన మోనాలిసా చిత్రం అపూర్వ కళాఖండంగా జగత్ ప్రసిద్ధిగాంచింది. లియొనార్డో మహామేధావి, దీర్ఘదర్శి. మనిషి ఆకాశంలో ఎగరగలడని ఆయన అప్పుడే ఊహించాడు. ఎగిరే విమానాన్ని ఆయన ఆనాడే చిత్రించాడు.

ఆయన కాలంలో చిత్రకారులు తాము ఉపయోగించే రంగులలో తమ రక్తాన్నీ, లాలాజలాన్నీ ఉపయోగించే వారట. అందువల్ల ఇప్పుడు లియొనార్డో చిత్రించిన చిత్రాల నుంచి ఆయన డి. ఎన్. ఏ. కనుగొనడానికి శాస్త్రవేత్తలు పరిశోధనలు జరుపుతున్నారు. ఆయన వ్యక్తిత్వాన్ని గురించి డి.ఎన్. ఏ. స్పష్టంగా తెలియజేస్తుంది. ఈ విషయం గురించి ప్రస్తావిస్తూ, టస్కాన్‌లోని లియొనార్డో మ్యూజియం డైరెక్టర్, ''దీనిని మేము ఒక నేరపరిశోధన లాగా భావించి, వేలి ముద్రల నిపుణుల సాయంతో, పోలీసు పద్ధతులనుఅనుసరిస్తూ, తీవ్రంగా పరిశోధనలు జరుపుతున్నాము,'' అని అన్నాడు.



## అంగారక గ్రహవాసుల ఆహారం!

భూమి నుంచి అంగారక గ్రహం చేరుకోవాలంటే వెయ్యి రోజులు ప్రయాణం చెయ్యాలి. ఆ గ్రహంపై అడుగుపెట్టి అక్కడే ఉండాలనుకునేవారు శాకాహారులుగా ఉండాలనీ, అందులోనూ అంతరిక్షంలో పండించడానికి వీలయ్యే- కేరట్, గోధుమ, టొమాటోలు, సోయాబీన్స్ మొదలైన పదిహేను రకాల కాయకూరలనూ, ధాన్యాలనూ మాత్రమే తినే వారుగానే ఉండాలనీ, ఈ విషయంగా శాస్త్రవేత్తలు విస్తృతంగా జరిపినపరిశోధనలు తెలియజేస్తున్నాయి.





# వ్యవస్థాపకుల లేఖ



ప్రియమైన పాఠకులకూ, మిత్రులకూ నమస్కారం!

చందమామ ప్రారంభించినప్పుడు భారతదేశ పరిస్థితులు భిన్నంగా ఉండేవి. చాలా కొద్ది ప్రచురణా సంస్థలే ఉండేవి. పిల్లలకంటూ ప్రత్యేకంగా చెప్పుకోతగ్గ పత్రిక లేదనే చెప్పాలి. అచ్చుయంత్రాలు పనిచేసే విధానం - మాయాజాలంలాంటి ఈనాటి సాంకేతిక విధానానికి ఊహించలేని దూరంలో ఉండేది. టీవీలు లేవు. కంప్యూటర్లు లేవు. ఇక ఈనాడు మనకు అందుబాటులో వున్న ఇతర సమాచార సాంకేతికరంగ పరికరాల మాట సరేసరి!

అయినప్పటికీ, అది భారతదేశం నూతనశకంలోకి అడుగుపెడుతూన్న సంధియుగం. బ్రిటిష్ పాలన నుంచి విముక్తి పొందిన భారత్ స్వతంత్రంగా నిలబడి ప్రగతి పథంలో సాగడానికి ఆయత్తమవుతూన్న కాలం!

ఆ కాలఘట్టంలో నేనూ, నా మిత్రులు స్వర్గీయ చక్రపాణిగారూ తీవ్రంగా ఆలోచించ సాగాము. రేపటి భారతం హాయిగా చిరునవ్వులు చిందించాలంటే, ఈనాటి పిల్లలను మనం నవ్వేలా చేయాలి. నేటి బాలలు మహోన్నతమైన మన సంస్కృతీ వారసత్వాన్ని గ్రహించి ప్రేమించేలా చేయగలిగినప్పుడే, రేపటి భారతం బలమైన దేశంగా రూపుదిద్దుకుంటుంది. పిల్లలందరూ కలిసి మంచి సాహిత్యాన్ని చదివి ఆనందించేలా చేయాలి. భారతీయులమన్న భావం అందరిలోనూ కలిగించాలి. ఈ ఉదాత్త లక్ష్యంతో విలక్షణమైన అపూర్వ ప్రయోగానికి పూనుకున్నాం. అదే **చందమామ** ఆవిర్భావం! విభిన్న భాషలలో ఒకే భావం. మొగ్గల్లాంటి పసి హృదయాలను రంజింపజేయడానికి కథలు, పురాణ ఇతిహాసాలు, జానపద కథలు- అంటూ భారతీయ సాహితీ నిధుల తలుపులు తెరిచాము. పసిపిల్లల మనసులు సుందర లోకాలలో విహరించేలా చేశాము.

క్రమక్రమంగా చందమామ ఇంటింటి పత్రికగా పరిణమించింది. ఒడిదుడుకులు, అవరోధాలు అప్పుడప్పుడు ఎదురైనప్పటికీ ముందుకే సాగింది. అయితే, ఇటీవలి కాలంలో కొన్ని అనివార్య పరిస్థితుల కారణంగా- ఒక సంవత్సరానికిపైగా ప్రచురణ తాత్కాలికంగా ఆగింది. అయినా పత్రిక పట్ల ఉన్న సుహృద్భావం మళ్ళీ జయించింది. కూరుకుపోతూన్న రథచక్రాలను పైకెత్తి, గమ్యంకేసి పయనించడానికి మళ్ళీమార్గంలోకి మళ్ళించి, తగిన సమయంలో చేయూత నిచ్చిన ఆ ఉన్నత హృదయాలను మనసారా అభినందిస్తున్నాను!

ఈ సందర్భంగా రెండువిషయాలు నాకు ఆనందం కలిగిస్తున్నాయి. ఒకటి, పత్రిక 53వజన్మదినోత్సవం జరుపుకోవడం. రెండు, కొద్దిపాటి విరామం తరవాత మరింత ఆకర్షణీయంగా, నవతేజంతో చందమామ మీ ముందుకు రావడం.

చందమామ దినదిన ప్రవర్థమానం కావాలని ఆశిస్తూ; పాఠకలోకానికీ, మిత్రులకూ, శ్రేయోభిలాషులకూ శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను.

– బి. నాగిరెడ్డి

కథకు సరైన ముగింపు రాయండి! చక్కని బహుమతి గెలుచుకోండి!

# సృజనాత్మక పోటీ!

*ఒక చిన్నకథ తొలిభాగం దిగువఇవ్వబడింది. ఆసక్తి కరమైన కథగా రూపొందే అంశాలన్నీ అందులో ఉన్నాయి. అయితే, దాన్ని రసవత్తరంగా మలిచే శక్తి మీ చేతుల్లోనే ఉంది. సరైన ముగింపుతో, మిగిలిన కథను రాయండి. కథకు తగిన పేరు పెట్టండి. మీ రచన 200 పదాలకు మించకుండా ఉండాలి. ఉత్తమమైన ముగింపుకు ఆకర్షణీయమైన బహుమతి ఇవ్వబడుతుంది. ఈ పోటీ మన యువపాఠకుల కోసమే నిర్దేశించబడింది. మీ పేరు, వయసు, చదివే తరగతి, పాఠశాల, పిన్‌కోడ్‌తో సహా మీ ఇంటి చిరునామా రాయడం మరిచిపోకండి. పెద్దలకన్నా మీరే చక్కగా రాయగలరని నిరూపించడానికి ఇదొక అరుదైన అవకాశం. అందువల్ల పెద్దల సాయం తీసుకోకండి. ఇక కథను చూద్దాం:*

అనగనగా ఒక గురువు. ఆయన మిగిలిన గురువుల్లాగా గంభీరంగా ఉండేవాడు కాదు. ఎప్పుడూ సరదాగా నవ్వుతూ ఉండేవాడు. ఆయనకు తగ్గట్టే ఆయన చుట్టూ కొందరు చిలిపి శిష్యులు చేరారు. తమ గురువు ఒక చోటి నుంచి మరొక చోటికి నడిచి వెళ్ళడం చూసి శిష్యులు తెగ బాధపడిపోయారు. తమ గురువు అంతటివాడు కాళ్ళతో నడవడమా? ''ఊహు, ఆయన్ను నడవ నివ్వకూడదు!'' అన్నాడు ఒక శిష్యుడు. ''అవునవును! ఆయన్ను మనం మన భుజాల మీద మోసుకు వెళదాం!'' అన్నాడుమరొక శిష్యుడు. ''ఆయన వృద్ధుడు కదా? పట్టు తప్పికిందపడితే, ఆ నింద మన మీద పడుతుంది కదా?'' అని హెచ్చరించాడు వేరొక శిష్యుడు. ఏంచేద్దామా అని అందరూ కలిసి బుర్ర బద్దలయ్యేలా ఆలోచించారు. ఆఖరికి ఒక శిష్యుడు, ''గురువు ప్రయాణానికి ఒక గుర్రాన్ని కొందాం!'' అన్నాడు. ''బ్రహ్మాండమైన ఆలోచన! అయినా మన గురువుగారిని సంప్రదించాలి సుమా!'' అన్నాడు ఇంకొక శిష్యుడు. వాళ్ళ అదృష్టం బావుండి, గురువుకు కూడా ఆ ఆలోచన నచ్చింది. ''మంచి గుర్రాన్ని తీసుకు రాగలరేమో చూడండి,'' అన్నాడు గురువు.

హుటాహుటిగా శిష్యులు సంతకు బయలు దేరారు. దారిలో చెరువు దగ్గర వారికి కొన్ని గుర్రాలు కనిపించాయి. సంతకు వెళ్ళి గుర్రం వెల అడిగి తెలుసుకుని, ''అంత ధరా?'' అని దిగ్భ్రాంతితో అవాక్కయి పోయారు. ''నాదొక ఆలోచన!'' అన్నాడు ఒక శిష్యుడు. ''ఏమిటి?'' అని అడిగారు మిగతా అందరూ ఒక్కసారిగా. ''మనం హాయిగా ఒక గుర్రం గుడ్డును కొని పొదిగించుకుంటే గుర్రంపిల్ల పుడుతుంది కదా?'' అన్నాడు మొదటి శిష్యుడు. ''అద్భుతమైన ఆలోచన!'' అంటూ అందరూ ఆమోదించారు. ఆశ్రమానికి పరిగెత్తుకువచ్చి తమ తాజా పథకాన్ని విన్నవించారు గురువుకు. ''ఆహా! నామహాజ్ఞానంలో కొంతయినా నా శిష్యులకు సంక్రమించడం నాకు అమితానందం కలిగిస్తున్నది!'' అన్నాడు గురువు.

*ఆ తరవాత గురుశిష్యుల ప్రయత్నం ఏమయిందో, మీరు ఊహించగలరా? మీ కథను రాసి, పేరు పెట్టండి. మీ ఎంట్రీలమీద 'సృజనాత్మక పోటీలకు' అని రాసి జూలై 30వ తేదీలోగా మాకు చేరేలా పంపండి. గెలుపొందిన రచనను సెప్టెంబర్ నెల సంచికలో ప్రచురిస్తాం.*

*— సంపాదకుడు*

## జూన్ 2000 భారత దర్శనం క్విజ్ సమాధానాలు

1. ఎ. గుణాఢ్యుడి బృహత్కథ ప్రేరణతో రచింపబడిన దశకుమార చరిత్ర.

   బి. యోగవాశిష్ట రామాయణం. వశిష్టుడు, వాల్మీకి కలిసి రచించారని చెబుతారు.

   సి. విశాఖదత్తుడి ముద్రారాక్షసం.

   డి. శూద్రకుడు. మృచ్ఛకటికం.

2 అర్జునుడు, బభ్రువాహనుడు, ఉలూపి.



బేతాళ కథలు

# పరంధాముడి మోక్షం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, మనుషుల్లో కొందరికి చిన్నమెత్తు పని చేయకుండా, ఇటు కాలు అటు కదపకుండా సోమరులుగా జీవించడం ఆనందకారణంగా వుంటుంది. అందుకు భిన్నంగా, భీతిగొలిపే ఈ శ్మశానంలో అర్ధరాత్రివేళ నానా శ్రమలకూ ఓర్చి తిరుగాడుతుండడం, నీకు మహదానంద కారణమేమో అన్న




శంక కలుగుతున్నది. అలా కాక, నువ్వు నిజంగానే ఏదో ఒక మహత్కార్యాన్ని సాధించ దలచి ఆ లక్ష్యంకోసం ఇంత కఠోర శ్రమకు పూనుకుంటేమాత్రం, లక్ష్యం సిద్ధించే సమయంలో పరంధాముడిలా అవివేకంగా ప్రవర్తించకు. నీకుహెచ్చరికగా వుండేందుకు, వాడి కథ చెబుతాను, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం ఒక అరణ్యసమీపానగల ఊళ్ళో, పరంధాముడనే యువకుడుండేవాడు. వాడికి నా అన్న వాళ్ళెవరూ లేరు. ఎంత కష్టపడినా వాడికి పూటగడవటమే కష్టంగా వుండేది. ఎన్ని విధాల ప్రాధేయ పడినా ఒక్కరూ వాడిని ఆదరించలేదు. ఎంత ఆలోచించినా వాడికి పరిష్కారం కనిపించలేదు. జీవితం మీద విరక్తి పుట్టి, అరణ్యానికి వెళ్ళి కొన్నేళ్ళపాటు ఘోరమైన తపస్సు చేయగా, వాడికి దేవుడు ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు.

''నాకు మోక్షం కావాలి. నన్ను నీలో కలుపుకో!'' అన్నాడు పరంధాముడు మారా లోచన లేకుండా.

దేవుడు చిరునవ్వు నవ్వి, ''మనిషి పుట్టుక పుట్టిన ప్రతివాడూ తనకోసం జీవిస్తూనే, ఇత రులకూ ఎంతో కొంత ప్రయోజనాన్నివ్వాలి. నువ్వు రెండూ చేయలేదు. కాబట్టి నీకు అప్పుడే మోక్షం రాదు. నేను నీకు అద్భుత శక్తుల నిస్తాను. వాటితో ఇతరులకు సాయ పడు. ఏరోజున నిస్వార్థంగా పరోపకారం చేస్తావో, ఆ రోజున నీజన్మ సార్థకమై మోక్షం లభిస్తుంది. అంతవరకూ నువ్వు మానవసేవ కొనసాగించు,'' అని పరంధాముణ్ణి చేయెత్తి దీవించి మాయమైపోయాడు.

పరంధాముడికి బ్రతుకు పట్ల ఆసక్తి లేదు. ఎంత తొందరగా మోక్షం వస్తుందా అని ఆత్రపడుతూ వాడు అరణ్యంలోంచి బయటపడేసరికి, అక్కడ ఒక యువకుడు కనిపించాడు. ఆ యువకుడు తలక్రిందు లుగా వుండి, చేతుల మీద చకచకా అటూ యిటూ తిరుగుతున్నాడు. పరంధాముడాశ్చ ర్యపడి, ఆ విచిత్ర చేష్టకు కారణమడిగాడు.

''నా తండ్రికి ఏదో తెలియని జబ్బుచేసి మంచం పట్టాడు. ఏ మందులూ పని చేయ డంలేదు. ఆయనను ఒక దుష్టశక్తి బాధిస్తు న్నదనీ, ఇలా కొంతసేపు ప్రతిరోజూ నేను చేతులమీద నడిస్తే, ఆ దుష్టశక్తి శాంతించ వచ్చుననీ, మా ఊరి గుడిపూజారి చెప్పాడు. అందుకే ఇలా చేస్తున్నాను,'' అన్నాడా యువకుడు.




‘‘ఇలా చేయడం నీకు కష్టంగా లేదా?’’ అని అడిగాడు పరంధాముడు.

‘‘లేకేం, ఉన్నది. అందులోనూ చిన్నప్పటి నుంచీ, నా ఎడమ చేయి బలహీనం. ఇలా కొన్ని రోజులు చేస్తే, ఆ చెయ్యి పూర్తిగా చచ్చుపడి పోతుందని వైద్యుడన్నాడు,’’ అని చెప్పాడాయువకుడు దిగులుగా.

అయితే, వాడింకా చేతులమీద నడవడం మాత్రం మానలేదు.

‘‘ఎడమ చేయి చచ్చుపడితే, ఆ తర్వాత మీనాన్నకు జబ్బునయమైతేమాత్రంనువ్వెలాబతుకుతావు?’’ అన్నాడుపరంధాముడు జాలిగా.

‘‘అయ్యా, ఈ ప్రపంచంలో కాళ్ళులేని వాళ్ళున్నారు. కళ్ళులేని వాళ్ళున్నారు. వాళ్ళందరూ సుఖంగా బతకడం లేదా? ఒక చెయ్యి చచ్చుపడితేనే జీవితం అంతమై పోతుందా? చచ్చుపడ్డ ఆచేతినిచూస్తూ, అదేమానాన్నకు జబ్బు నయంచేసిందన్న తృప్తితో మరింత ఉత్సాహంగా జీవితం గడుపుతాను,’’ అన్నాడా యువకుడు.

ఈ జవాబుకు పరంధాముడెంతో సంతోషించి, ‘‘బాబూ,నువ్వు ఉత్తముడివి. నీ పుణ్యమే, నీ సర్వేంద్రియాలకూ బలాన్నిచ్చి నీ తండ్రినీ మామూలు మనిషిని చేస్తుంది. ఇక ఈ తలక్రిందుల నడక మాని ఇంటికి వెళ్ళు. నామాట వృధాపోదు,’’ అన్నాడు.

ఆ యువకుడు చప్పున మామూలుగా నిలబడి, ‘‘అయితే, తమరు నా వెంట మా ఇంటికి రావాలి, స్వామీ!’’ అన్నాడు.

‘‘ఎందుకు?నాకు ప్రతిఫలమన్నా, సత్కారాలన్నా గిట్టదు!’’అన్నాడుపరంధాముడు!

‘‘అయ్యో స్వామీ! తమ బోటి మహాత్ములకు ప్రతిఫలం, సత్కారం చేయగలననుకుంటే, అది నాఅహంకారమే అవుతుంది. మా ఊళ్ళో యింకాఎందరో బాధితులున్నారు. వారందరికీతమరు సాయపడాలని, నా కోరిక,’’ అన్నాడా యువకుడు.

పరంధాముడు దీనికి మరింత ఆశ్చర్యపడి, ‘‘నాకు చిన్న పనివుంది. ముందు నువ్వు ఇంటికి వెళ్ళు. కొద్ది సేపట్లో నేను వస్తాను,’’ అని ఆ యువకుణ్ణి పంపేశాడు.

తర్వాత పరంధాముడు, మనసారా దేవుణ్ణి స్మరించుకుని, ‘‘నిస్వార్థంగా పరోపకారం చేశాను. నన్ను నీలోకలుపుకో,’’ అన్నాడు.

‘‘నీకంటే నిస్వార్థపరుడైన, ఆ యువకుడికే ఇవ్వని మోక్షాన్ని, అప్పుడే నీకెలా ఇస్తాననుకున్నావు? ఆ యువకుడి కిచ్చిన మాట

నిలబెట్టుకునేందుకు, వాడి ఊరికి వెళ్ళు!'' అన్న మందలింపు మాటలు పరంధాముడి చెవిలో వినబడ్డాయి.

''ఆయువకుడు నాకంటే నిస్వార్థపరుడెలా అయ్యాడు?'' అన్నాడు పరంధాముడు ఆశ్చర్యంగా.

''అది తెలిసిన మరుక్షణం నీకు మోక్షం తప్పక లభిస్తుంది,'' అన్న దేవుడి మాటలు, పరంధాముడి చెవిలో వినబడ్డాయి. ఇక చేసేదిలేక, వాడు యువకుడి ఊరు చేరుకున్నాడు.

ఆసరికి యువకుడి తండ్రి మామూలు మనిషై పోయాడు. యువకుడు పరంధాముడి గురించి ఊరివారందరికీ చెప్పేయడంతో, వారంతా పరంధాముడికి ఘన స్వాగతం ఇవ్వడానికి సిద్ధంగా వున్నారు.

ఆ ఊళ్ళో కొందరికి అప్పులబాధ. కొందరికి జబ్బులబాధ. కొందరికి అత్తపోరు. కొందరికి కోడలిపోరు. కొన్ని పొలాలలో పంటసరిగ్గా పండదు. కొన్ని బావుల్లో నీరు ఊరదు. నెల తిరక్కుండానే మొత్తం అందరి బాధలూ తీర్చి పరంధాముడు ఊరిని సుభిక్షం చేశాడు.

ఆ ఊళ్ళో రంగడనే పోకిరీ ఒకడున్నాడు. ఉన్నవాళ్ళు, లేనివాళ్ళను బాధించడానికి, వాడిని ఉపయోగించుకునేవారు. పరంధాముడు వచ్చాక, ఊళ్ళో లేనివాళ్ళంటూ లేకుండా పోయారు. అందువల్ల, ఎవరూ రంగణ్ణిపట్టించుకోవడం మానేశారు. క్రమంగా వాడిలో పశ్చాత్తాపం కలిగింది.

రంగడు ఒక రోజున పరంధాముడి దగ్గరకు వెళ్ళి, ''స్వామీ! గతంలోనేను దుష్టుడుగా బతికిన తీరు నన్ను బాధిస్తున్నది. ఆ బాధనన్ను వేధిస్తున్నది. ఈ బాధవదలాలంటే మోక్షం ఒక్కటే మార్గం. నాకు మోక్షం ఇప్పించండి!'' అని వేడుకున్నాడు.



పరంధాముడు, వాడికి ధన కనక వస్తు వాహనాదులిస్తానన్నాడు. ఆ ఊళ్ళోకాకపోతే, మరెక్కడికైనా వెళ్ళి హాయిగా జీవించ మన్నాడు.

రంగడు తల అడ్డంగా ఊపి, ''స్వామీ! మరెక్కడికైనా వెళితే, నేను మళ్ళీ మునుపటి రంగడిలా ప్రవర్తించి ఎందరినో వేధిస్తాను. నాకు మోక్షమే మేలు. అది మీ వల్లనే లభిం చాలి,'' అన్నాడు.

''సరే, నీ విషయం ఆలోచిస్తాను. రేపు రా!'' అని రంగణ్ణి పంపేసి, పరంధాముడు దేవుణ్ణి స్మరించుకుని కర్తవ్యం అడిగాడు.

''రంగడికి మోక్షమివ్వాలనుకుంటే, నువ్వు నీ మోక్షాన్ని వదులుకోవాలి. బాగా ఆలోచించుకో,'' అన్నాడు దేవుడు, పరం ధాముడి చెవిలో.

మర్నాడు పరంధాముడు, రంగడితో, ''నీకు నా పుణ్యాన్నిస్తున్నాను. దేవుణ్ణి స్మరిస్తూ పవిత్ర నదీజలంలో స్నానం చేయి. నీకు తప్పక మోక్షం లభిస్తుంది!'' అని పంపేశాడు.

అప్పుడు వాడి ముందు దేవుడు ప్రత్య క్షమై, ''నాయనా! నీకు మోక్షాన్నిస్తున్నాను. ధన్యుడివి!'' అన్నాడు.

పరంధాముడు కలవరపడుతూ, ''పర మాత్మా! నాకు మోక్షం పొందాలనిలేదు,'' అన్నాడు.

''నీ పాత్ర ఇంతటితో ముగిసింది. ఈ సాయంత్రమే నువ్వు పవిత్రనదీజలాల్లో స్నానం చేయి. మోక్షం లభిస్తుంది!'' అంటూ దేవుడు, పరంధాముడు ఏదో చెప్ప బోయేలోపలే అంతర్ధానమయ్యాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, గతంలో పరంధాముడు ఒకటికి రెండుసార్లు, దేవుణ్ణి మోక్షం ఇవ్వమంటూ ప్రాధేయపడ్డాడు. అయినా, దేవుడు అప్పుడు మోక్షం ఇవ్వ





వివేకవంతులు తమ సంపదలనూ, జీవితాలనూ పరుల మేలుకే అంకితం చేస్తారు. ఎందుకంటే అవి శాశ్వతాలు కావని వారికి తెలుసు.
-కౌటిల్యుడు

నిరాకరించి, వాడు తనకు మోక్షం వద్దంటున్న సమయంలో ఇవ్వడం వెనక, ఏదైనా పరమార్థం వున్నదా? దేవుడే మోక్షాన్నిస్తున్నానంటే, పరంధాముడు వద్దనడం అవివేకం, అనాలోచితం కాదా? ఇతరులకు హాని చేయడమే పనిగా బతికిన రంగడికి మోక్షప్రాప్తిసహేతుకం అనిపించుకుంటుందా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది?'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''పరంధాముడు తనకు మోక్షం వద్దనడం వెనక, వాడి పరోపకారచింతన వున్నది. అందుచేత, అది అవివేకం, అనాలోచితం కాదు. తనకు లభించిన అద్భుతశక్తులద్వారా, వాడు మానవసేవ చేయాలనుకుంటున్నాడు. అయితే, మానవ సేవకు ఉపయోగించవలసింది, కేవలం అద్భుత శక్తులు మాత్రమే కాదు. మానవత్వం , విజ్ఞానం, సదాలోచన, సద్బుద్ధి. ఈ నాలుగూ మానవసేవ కోసం ఉపయోగిస్తున్న వారెందరో వున్నారు. వారి సేవలే ప్రపంచానికి శాశ్వతం. మానవ మేధకు అందని, ఒకానొక అతీతశక్తి ప్రపంచాన్ని శాసిస్తున్నదని తెలియజేయడానికే, దేవుడు అప్పుడప్పుడూ పరంధాముడి వంటి వారి ద్వారా తాత్కాలికంగా అద్భుతశక్తుల్ని ప్రదర్శిస్తూంటాడు. అలాంటి పాత్ర ముగియగానే, వాళ్ళు మోక్షప్రాప్తి పొందుతారు. ఇక, రంగడి విషయానికొస్తే, వాడిది నిజమైన పశ్చాత్తాపం. ఈ లోకంలో మరి కొంత కాలముంటే, ఏదో ఒకనాడు తిరిగి క్రూర కార్యాలకు పూనుకుంటానన్నది, వాడి భయం. అందువల్లనే వాడికి, దేవుడు మోక్షం ఇచ్చాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: ''వసుంధర'' రచన]



# ఈ నెలలో జన్మించిన ప్రముఖులు:

"స్వాతంత్ర్యం నాజన్మహక్కు!" అని చాటి దేశ ప్రజలలో నిద్రాణమైవున్న దేశభక్తినీ, స్వాతంత్ర్య దీప్తినీ తట్టిలేపిన జాతీయ నాయకుడు బాలగంగాధర తిలక్. ఆయన 1856వ సం॥ జూలై 23 వ తేదీ మహారాష్ట్రలోని రత్నగిరిలో జన్మించాడు. ఆయన్ను 'భారత విప్లవ పిత'గా వర్ణిస్తారు. ఆయన అరవింద ఘోష్ (శ్రీఅరవిందులు)తో కలిసి భారత జాతీయ కాంగ్రెస్‌ను అతివాదం వైపు మళ్ళించడానికి ప్రయత్నించాడు.

బాలగంగాధరతిలక్ న్యాయవాది కావాలని చట్టవిద్యను అభ్యసించాడు. అయినా ఆయన సంఘసంస్కర్తగానూ, పత్రికారచయితగానూ దేశప్రజల మన్ననలనందుకున్నాడు. ఆంగ్లభాషలో 'మరాఠా' అనే పత్రికనూ, మరాఠీలో 'కేసరి' అనే పత్రికనూ నడిపాడు.



బాలగంగాధర తిలక్

ప్రజలలో దేశభక్తిని ప్రేరేపించడానికి 1897 వ సం॥ నుంచి యేటా ఛత్రపతి శివాజీ పేరుమీదుగా ఉత్సవాలు జరపడం ప్రారంభించాడు తిలక్. ఒకసారి పూనాలో ప్లేగ్‌వ్యాధి ప్రబలింది. దానిని అరికట్టే సాకుతో బ్రిటిష్ ప్రభుత్వం సామాన్య ప్రజలను వేధించింది. బ్రిటిష్ దుడుకు చర్యలను తిలక్ గట్టిగా విమర్శించాడు.అదిపాలకులకుఆగ్రహం కలిగించింది. రాజద్రోహం నేరంకింద తిలక్‌ను జైల్లోపెట్టారు.

1907వసం॥ లో సూరత్‌లో చారిత్రాత్మకమైన జాతీయ కాంగ్రెస్ మహాసభ జరిగింది. అరవింద ఘోష్, తిలక్ నాయకత్వంలో పలువురు ప్రతినిధులు-పరిపూర్ణ స్వాతంత్ర్యం కోరుతూ తీర్మానం చేయాలని నిర్ణయించారు. అయితే మితవాదులైన మిగిలిన ప్రతినిధులు అంతటి తెగింపుకు సిద్ధంగా లేరు. తత్ఫలితంగా కాంగ్రెస్ రెండుగా చీలిపోయింది. అరవిందులు అధ్యక్షతలో జరిగిన కాంగ్రెస్ అతివాద పక్ష సమావేశంలో తిలక్ ప్రధాన వక్తగా ప్రసంగించాడు.

1910వసం॥ లో అరవిందులు పాండిచ్చేరికిచేరాడు. 1920 ఆగస్టులో తిలక్ మహరాజ్ కీర్తిశేషుడయ్యాడు.అదే సంవత్సరం డిసెంబర్‌లో నాగపూర్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభలో పరిపూర్ణ స్వాతంత్ర్యం కావాలన్న తీర్మానం నెరవేర్చబడింది!

తిలక్ కేవలం రాజకీయవేత్త మాత్రమే కాదు; గొప్ప పండితుడు. కర్తవ్యనిర్వహణ ప్రధానమని నిరూపిస్తూ ఆయన భగవద్గీతకు రాసిన వ్యాఖ్యానం 'గీతారహస్యం;' మరొక ముఖ్య గ్రంథం 'ఓరియన్' చాలా ప్రసిద్ధి గాంచాయి.

బాలగంగాధర తిలక్ ఇలా అన్నాడు:"ప్రపంచ గతిని నడిపించే ఉన్నత శక్తులు ఏవో ఉన్నాయి. నా ఆశయాలనూ, నేను కాంక్షించే లక్ష్యాన్నీ; నేను స్వతంత్రంగా ఉండడం కన్నా, బాధలు అనుభవించడం ద్వారానేసిద్ధింప జేయడం దైవసంకల్పం కావచ్చు!"



# అచ్చిరాని వ్యాయామం

అనగా అనగా ఒక రాజు. ఆ రాజుకు ఇద్దరు కొడుకులు. పెద్దవాడు అజేయుడు. చిన్న వాడు విధేయుడు. పదునారేండ్ల ప్రాయం వచ్చేసరికి సకల విద్యలూ నేర్చారు.

ఇద్దరిలో ఎవరికి రాజ్యం అప్ప జెప్పాలా అన్నది, రాజుకు సమస్య అయింది. బాగా ఆలోచించి, ఆయన ఇలా అనుకున్నాడు: ''రాజు ప్రజలకు దేవుడితో సమానం. రాజు చిత్రపటాలు, శిల్పాలు రాజ్యంలో ఎన్నో చోట్ల వుంటాయి. చిత్రకారులు, శిల్పులు దేవుడి బొమ్మలను ఎంతో అందంగా తయారు చేస్తారు. దేవుడు ఊహలో పుట్టాడు కాబట్టి, వారికి అది సాధ్యపడుతుంది. రాజు నిజంగా అందంగా వుంటే తప్ప అది సాధ్యపడదు. మగవాడి అందం ముఖంలో కాక, శరీర సౌష్ఠ వాన్ని బట్టి వుంటుంది!''

రాజు తన కొడుకులిద్దర్నీ పిలిచి, ''మీ ఇద్దరిలో ఎవరు చక్కని శరీరసౌష్ఠవం కలిగి వుంటే వారిని రాజును చేస్తాను. అందుకు మీకు రెండేళ్ళగడువు ఇస్తున్నాను. దేశసంచారం చేసి రండి. అయితే, మీరు యువరాజులన్న విషయం బైటపెట్టకూడదు,'' అనిచెప్పాడు.

ఆ దేశంలో జగమల్లుడనే గొప్పజెట్టీ వున్నాడు. ఆయన సంవత్సరానికి ఒక్కడంటే ఒక్కణ్ణి మాత్రమే శిష్యుడిగాచేర్చుకుంటాడు. మల్లవిద్యలోని సులువులు నేర్పడమే కాక, శరీర సౌష్ఠవాన్ని కాపాడే రకరకాల వ్యాయా మాలాయనకు తెలుసు.

తండ్రి మాట వింటూనే అజేయుడు ప్రయాణమై మల్లుడి ఊరు చేరుకున్నాడు. అదృష్టం కొద్దీ మర్నాడే మల్లుడు, శిష్యుణ్ణి ఎన్నుకునే రోజు. అజేయుడు అన్ని పరీక్ష ల్లోనూ నెగ్గి ఆయన శిష్యుడయ్యాడు. మల్లు డతడికి మల్లవిద్యలోని మెలుకువలు నేర్పుతూ, వ్యాయామసాధనచేయించేవాడు. మొదట్లో అజేయుడికిది యిబ్బంది అని పించేది. హాయిగా తిని కూర్చోక, ఈ శ్రమ అంతా ఎందుకు పడుతున్నానా అని బాధ

జొన్నలగడ్డ రామలక్ష్మి

పడేవాడు. కానీ క్రమంగా శరీరం చెప్ప లేనంత అందంగా తయారవుతూంటే, అతడి ఆనందానికి అవధులు లేక పోయాయి.

తన అన్న మల్లుడి వద్ద చేరినట్టు తెలుసుకున్న విధేయుడు, తానిక అటు వంటి గురువుల వద్దకు వెళ్ళక తిన్నగా ఒక కుగ్రామం చేరాడు. ఆ గ్రామంలో పంటలు సరిగా వుండదు. నీటి సదుపాయం లేదు. అక్కడ దరిద్రం విలయతాండవం చేస్తున్నది.

విధేయుడు, గ్రామాధికారిని కలుసు కున్నాడు. గ్రామంలో అందరూ కలిసి పని చేస్తే గ్రామం బాగుపడడానికి ఎంతో కాలం పట్టదని ఆయనకు చెప్పాడు. ఇది విన్న గ్రామాధికారి, అతణ్ణి ఎద్దేవా చేస్తే, తానెవ రైందీ చెప్పేశాడు.

హడలిపోయిన గ్రామాధికారి, గ్రామ స్థులందర్నీ సమావేశపరిచి, వారికి విధే యుణ్ణి పరిచయం చేశాడు. విధేయుడు వారికి తన అభిప్రాయం చెప్పాడు.

"ఈగ్రామానికి శాపంవున్నది. మా కృషికి ఫలిత ముండదు," అన్నాడొకవృద్ధుడు.

"ఆ శాపం తొలిగిపోయింది కాబట్టే, నేను మీ గ్రామానికి వచ్చాను. మీరందరూ నేను చెప్పినట్టు వినాలి. వినని వారికి శిక్ష పడుతుంది. నామాట వింటే, మీ కృషికి ఫలితం లభించేలా చేసే బాధ్యత, నాది!" అన్నాడు విధేయుడు.

అతడి మాటలు కొందరికి ఉత్సాహం కలిగించాయి. కొందరు భయపడ్డారు. చివ రకు అందరూ అంగీకారం తెలిపారు.

గ్రామం అంతా కలిసి ప్రతిరోజూ కష్టపడి పని చేసేవారు. ఆ విధంగా బాటలు వేశారు. చెరువులు, నూతులు తవ్వారు. చెట్ల మొక్కలు నాటారు. మొదటి సంవత్సరం పంటలు ఒకమాదిరిగా పండాయి. అయితే, చెరువులు నిండాయి. మొక్కలు పెద్దపెద్దచెట్ల



య్యాయి. గ్రామస్థులను సోమరితనం పూర్తిగా వదిలి పెట్టింది. ఆ కారణంగా, మరొక ఏడాదికి గ్రామం సుభిక్షమైంది.

విధేయుడు గ్రామస్థులకు వీడ్కోలుచెప్పి, తండ్రి వద్దకు తిరిగి వెళ్ళాడు. అప్పటికి అజేయుడు రాజధానికి చేరుకుని సంవత్సరం అయింది. రాజు, ఇద్దరు కొడుకుల్నీ పరీక్షించగా, శరీరసౌష్ఠవంలో ఒకరి కొకరు తీసి పోకుండా వున్నారు. కానీ అజేయుడు రవంత మెరుగేమో అనిపించింది, రాజుకు.

ఆయన ఇద్దరి కథలూ విన్నాక, అజేయుడు కలగజేసుకుని, "నేను ఏడాదిలో సాధించిన శరీర సౌష్ఠవాన్ని, తమ్ముడు రెండేళ్ళలో గానీ సాధించ లేకపోయాడు. అదీగాక, తను యువరాజు నన్న విషయాన్ని దాచి పెట్టలేదు. అన్ని విధాల వాడునాకంటే తక్కువ. కాబట్టి నేనే రాజును కావాలి!" అన్నాడు.

అందుకు రాజునవ్వి, "రాజ్యమంటే మట్టి కాదు; మనుషులు, రాజు ఆ మనుషులు బాగు కోసం శ్రమించాలి. తానేం చేసినా తనకోసం కాక పదిమందికి ప్రయోజనం కావాలి. నువ్వు వ్యాయామం చేసి, నీ శరీరాన్ని ఎంతో శ్రమ పెట్టావు. అది నీ శరీరానికిమాత్రమేఅందాన్నిచ్చింది. విధేయుడు తన శరీరాన్ని శ్రమపెడితే, అందువల్ల ఒక గ్రామం బాగుపడింది. నువ్వు, తండ్రి నైన నా మాట వినడం వల్ల, నా కొక్కడికి మాత్రమే సంతోషం కలిగింది. విధేయుడు నామాట వినక, తను యువరాజునని చెప్పి నందు వల్ల, ఒక గ్రామానికి సుఖసంతోషాలు కలిగినై. వయసులో నీ కంటే చిన్న అయినా, దేశానికి రాజు కాదగ్గ లక్షణాలు విధేయుడిలో వున్నాయి. ఇప్పుడు తండ్రి మాటను గౌరవించినట్టే, మున్ముందు రాజు మాటను గౌరవించు. విధేయుడు రాజై, నువ్వు సేనాధిపతివైతే మన దేశం మరింత అభివృద్ధిని సాధిస్తుంది," అన్నాడు.

అప్పటికి, అజేయుడికి తండ్రి పెట్టిన పరీక్షలోని అసలు ఆంతర్యం అర్థమైంది. తన ఆలోచనలు తప్పుదారిలో నడిచి నందుకు సిగ్గుపడి తలవంచుకుని, ఆ తర్వాత తండ్రి చెప్పినట్టే చేశాడు.





# స్వర్ణసింహాసనం

**8**

[రాజగురువు సలహా ప్రకారం కౌండిన్య దేశపు రాజధానీ నగర మైదానంలో జరిపిన తవ్వకాలలో అపూర్వ స్వర్ణసింహాసనం ఒకటి బయటపడింది. విజయదత్తుడు పట్టాభిషేకానికి సంసిద్ధుడై, స్వర్ణసింహాసనం తొలిమెట్టు మీద పాదం మోపగానే అక్కడి సాలభంజిక సత్యశక్తి అతడి సూక్ష్మబుద్ధిని పరీక్షించటానికి ఒక కథ చెప్పి, దానికి సంబంధించిన ప్రశ్న అడిగి సమాధానం చెప్పమన్నది. యువరాజు సరైన సమాధానం చెప్పాడు. రెండవ మెట్టు మీది సాలభంజిక ధర్మశక్తి, ధర్మప్రభువైన సువర్ణగిరిరాజు కుశధ్వజుడి కుమారుడు యువరాజు మలయధ్వజుడు రాజద్రోహులనూ, నయవంచకులనూ హతమార్చిన కథను వివరించ సాగింది. —తరవాత]

**ఆ** రాత్రే గురన్న సహాయంతో రాజు వజ్రకీర్తి శయనాగారంలో ప్రవేశించిన మలయధ్వజుడు గాఢనిద్రలో వున్న వజ్రకీర్తిని సున్నితంగా తట్టిలేపాడు.

ఉలికిపాటుతో కళ్ళు తెరిచిన వజ్రకీర్తి, ఎదురుగా కనిపించిన అపరిచితుణ్ణి చూసి పెద్దగా అరవబోయాడు. అయితే, మలయధ్వజుడు చప్పున, తన ఎడమ అరచేతిని వజ్రకీర్తి నోటికి అడ్డంగా పెట్టి గట్టిగా అదిమి, కటువుగా, ''వజ్రకీర్తీ! నిద్రలో వున్న నా తండ్రిని దొంగచాటుగా వచ్చి చంపి, అధర్మంగా రాజ్యాన్ని దురాక్రమణ చేసిన పాపివి నువ్వు. అయినా నేను నిన్ను ధర్మబద్ధంగానే చంపుతున్నాను,'' అంటూ కనురెప్పపాటులో తన ఖడ్గం చంద్రహాసాన్ని ఒరనుంచి లాగి, వజ్రకీర్తి గుండెల్లో బలంగా పొడిచాడు.

అదే సమయంలో, వీరన్న సహాయంతో, ద్రోహి అయిన సేనాని కందర్పుడి భవనాన్ని, పురుషవేషంలో ప్రవేశించిన శాలిని, నిద్రపో

లక్ష్మి గాయత్రి



తున్న కందర్పుణ్ణి, ఒకచేత్తో తట్టిలేపి, అతడు కళ్ళు తెరుస్తూండగానే, మరొకచేత సిద్ధంగా పట్టుకుని వున్న విషపుసూదిని, అతడిశరీరం లోకి లోతుగా గుచ్చింది. జరుగుతున్న దేమిటో గ్రహించేలోగా అత్యంతప్రమాద కరమైన, ఆ విషం క్షణకాలంలో కందర్పుడి కళ్ళను శాశ్వతంగా మూతలు పడేలా చేసింది.

తెల్లవారేసరికి జరిగినదంతా, నగరంలో తెలిసిపోయింది. సువర్ణగిరి ప్రజలు, తమ యువరాజు క్షేమంగా తిరిగివచ్చి, తమకు రాజైనందుకు అమితోత్సాహంతో ఆనందోత్స వాలు జరుపుకున్నారు.

రాజైన తర్వాత, మలయధ్వజుడు గురన్నకు కావలసినంత వెండిబంగారాలు కానుకలిచ్చిపంపాడు.

వీరన్నను పిలిచి, "కందర్పుడికావలివాడి వైనందుకు, అతడి ద్రోహబుద్ధిని కూడా కాస్త ఒంటపట్టించుకున్నట్టున్నావు! వేరుపురు గులా ప్రమాదకారివైనప్పటికీ, నీ నుంచి నేను పొందిన సహాయానికి ఫలితంగా నిన్ను చంపకుండా వదిలేస్తున్నాను. నీవంటివాడు, ఎటువంటిబాధ్యతాయుతమైనపదవిలోనూ వుండ తగడు! రేపటి నుంచి నువ్వు రాజోద్యా నంలో పూలమొక్కలకు కలుపు తీసేపని చెయ్యి," అని చెప్పాడు.

సుకేతుడికుటుంబానికి తనసహపంక్తిలో విందుచేసి, కానుకలిచ్చి పంపుతూ, "స్నేహ బాంధవ్యాన్ని కనబరచిన మీరు నాకు బంధు సమానులు! నేటినుంచి కోటలో జరిగే ప్రతి ఉత్సవానికీ మీరు నాఅతిథులుగా రావాలి," అన్నాడు.

సుకేతుడికుటుంబంవాళ్ళుఆమాటలకు చలించిపోతూ అతడికి పదేపదే కృతజ్ఞతలు తెలుపుకున్నారు.

వారం రోజుల తర్వాత, మలయధ్వజుడు భిల్లరాజైన సింహగుప్తుడికి ఆహ్వానంపంపి, అతడు రాగానే, తను అతడికుమార్తెఅయిన శాలినినివివాహమాడగోరుతున్నట్టుచెప్పాడు. ఇందుకు శాలినితోపాటు సింహగుప్తుడుకూడా పరమానందభరితులయ్యారు. మలయధ్వజ శాలినిల వివాహం అత్యంత వైభవంగా జరిగింది.

కథ చెప్పటం ముగించిన సాలభంజిక, "ఓ కాబోయే మహారాజా! కథలో శాలినిని మినహాయిస్తే, మలయధ్వజుడికి సహాయ పడిన మిగతాముగ్గురూ, అతడిపౌరులే! వాళ్ళ దగ్గర నుంచి అతడు పొందిన సహాయం,

దాదాపుగా సమానమే. కాని, వాళ్ళను అతడు సత్కరించిన రీతిమాత్రంసమానం కాకపోగా చిత్రంగావున్నది. గురన్నకు ఏవో కానుక లిచ్చి వదిలించుకున్న అతడు సుకేతుడితో మాత్రం లేనిపోని బంధుత్వాన్ని కలుపుకుని అతి మర్యాద చేశాడు. వీరన్నను మొదటి నుంచీ హింసిస్తూనే వచ్చింది చాలక, అతడి నుంచి సహాయం పొందికూడా, ప్రతిఫలంగా చంపకుండా వదిలేస్తున్నాను పొమ్మన్నాడు. అంతగా అతడి కోపానికి గురయ్యే పనేమీ వీరన్న చేయలేదు కదా? తన పౌరుల నుంచి దాదాపుగా సమాన సహాయాన్ని పొందిన ఒక మహారాజు, ఇలా రకారకాలుగా ప్రవర్తించడం వెనుక, ఏమైనా సూక్ష్మధర్మాలు న్నాయా?ఉంటేఅవేమిటి?మలయధ్వజుడి స్థానంలో నువ్వేఉండివుంటే, నీకుసహాయం చేసిన ముగ్గురినీ, నువ్వెలా సత్కరిస్తావు?ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పగలిగావా, నీకు రెండవ మెట్టు మీద పాదం మోపి, మూడవ మెట్టుమీద వున్న మా సోదరిన్యాయశక్తి చెప్పబోయే కథవినే అర్హత కలుగుతుంది. అయితే సరైన సమాధానం చెప్పలేక పోయావో, ఈ క్షణమే నీకళ్ళముందునుంచి ఈ అపూర్వ స్వర్ణసింహాసనం మాయమవుతుంది,'' అన్నది.

అప్పుడు విజయదత్తుడు, '' ఓ ధర్మశక్తీ! కథలోని మలయధ్వజుడి భిన్న ప్రవర్తనకు, అతడికి సహాయం చేసిన ముగ్గురి స్థాయీ భేదాలే కారణం. వారి ముగ్గురిలోనూ వీరన్నది అథమస్థాయి, గురన్నది మధ్యమ స్థాయి , సుకేతుడిది ఉత్తమస్థాయి! ఏ మహారాజైనా సరే, శిక్షించటానికైనా, సత్కరించ



టానికైనా ఆ వ్యక్తి స్థాయిని పరిగణనలోకి తీసుకుని వ్యవహరించటమే సూక్ష్మధర్మం. పామరులు ధనంతోనూ, పండితులు ఆదరణతోనూ తృప్తిచెందుతారు. రాజ్యక్షేమం కోసం అధముణ్ణి శిక్షించి తీరాలి. విధిలేని పరిస్థితుల్లో, ఆ అధముడి దగ్గరనుంచే సహాయంపొందినప్పుడు, మలయధ్వజుడు చెప్పినట్టు, ప్రాణదానమే వాడికి గొప్పమేలు చేసినట్టు!

పోతే, తన పౌరుల మానసిక స్థాయిని గుర్తించగల శక్తి ఏ రాజుకైనా తప్పక వుండి తీరాలి. అది మలయధ్వజుడిలో పుష్కలంగా వున్నది.అందువల్లనే అతడు, వీరన్నలోని నైచ్యాన్నిక్షణాలలో గుర్తించగలిగాడు. గురన్న, వీరన్న ఇద్దరూ సాధారణ స్థాయికి చెందిన వ్యక్తులే. రాజభక్తి గల ఆ స్థాయి



పౌరులు గురన్న ప్రవర్తించినట్లే ప్రవర్తిస్తారు. కాని, వీరన్న దీనికి విరుద్ధంగా యువరాజు రాకకు మొదట ఆశ్చర్యపోయాడు. తరవాత సామాన్య పౌరుడికుండే భయసంకోచాలు ఏవీ కనబరచకుండా వెంటనే ఆయనకు సహాయం చెయ్యటానికి సిద్ధపడ్డాడు. అంటే, మలయధ్వజుడి దగ్గర అంగీకారం వ్యక్తంచేసి బయటపడి, కందర్పుడికి యువరాజు ఆచూకీ తెలియజేసి లాభపడాలన్న దురూహ అతడికి కలిగిందన్నమాట! అతడి ప్రవర్తన ద్వారా ఆ సంగతి గ్రహించిన మలయధ్వజుడు, అతనిపై దండోపాయాన్ని ప్రయోగించి, తనకు కావలసిన సహాయాన్ని పొందాడు. తర్వాత అతడు వీరన్నతో ప్రవర్తించిన తీరుకూడా ఎంతైనా ప్రశంసించదగిందే!

ఇక, మధ్యస్థాయికి చెందిన గురన్న కానుకలతో తృప్తి చెందుతాడు. అటువంటి వ్యక్తుల వల్ల రాజుకు లభించేది తక్కువ. అందుకే మలయధ్వజుడు, అతడిని వెండి బంగారాలలాంటి కానుకలతో తృప్తిపరచి వూరుకున్నాడు.

సుకేతుడూ, అతడి భార్యా ఇద్దరూ ఉత్తమ స్థాయిపౌరులు. రాజకీయపరమైన అవగాహన కలవారు. ముఖ్యంగా తిరుగులేని రాజభక్తి గలవారు. అటువంటి వారితో రాజు, అన్నిటా ఆత్మీయతాభావంతో మెలుగుతూ ఉండాలి. తనకు ఆశ్రయమిచ్చిన వాళ్ళు కాబట్టి మలయధ్వజుడు మరొక్క అడుగు ముందుకు వేసి ఆప్యాయంగా వారితో బాంధవ్యాన్ని కలుపుకున్నాడు. అది కూడా మెచ్చదగిందే! మలయధ్వజుడి స్థానంలో నేనువున్నా, నా ప్రవర్తనకూడా అలాగే వుంటుంది!'' అన్నాడు.

అతడి జవాబు వినగానే, రెండవ మెట్టు మీద వున్న సాలభంజిక, ''భళీ, భళీ, విజయదత్తా! నా ప్రశ్నలకు సరైన సమాధానాలు చెప్పి రెండవ మెట్టు చేరే అర్హతను సంపాయించుకున్నావు. కాబోయే మహారాజువైన, ఓ యువరాజా! నీకు నా హృదయపూర్వక స్వాగతం!'' అన్నది.

సాలభంజికమాటలుపూర్తిఅయీకాగానే సభాభవనమంతా ఒక్కసారిగా జయజయ ధ్వానాలతో దద్దరిల్లింది. మంగళవాద్యాలూ, వేదగానమూ శ్రావ్యంగా అక్కడ ప్రతిధ్వనించాయి.

ఆ మంగళధ్వనుల మధ్య విజయదత్తుడు రెండవ మెట్టుమీద హుందాగా తన పాదాన్ని

మోపి, మనసులో తమ కులదేవతను స్మరించి మూడవ మెట్టుమీద వున్న న్యాయ సాలభంజిక పెట్టబోయే ఆఖరి పరీక్షకు సిద్ధంగా నిలబడ్డాడు.

అప్పుడు మూడవదీ, ఆఖరుదీ అయిన న్యాయసాలభంజిక, చిరునవ్వు నవ్వుతూ, అతడికి శుభం పలికి, ''విజయదత్తా! నేను న్యాయశక్తిగా నీకు ముందే పరిచయమ య్యాను. న్యాయవర్ధనుడనే, ఒక మహారాజు కథ చెబుతాను. శ్రద్ధగా విను,'' అంటూ ఇలా ప్రారంభించింది:

సుభద్ర దేశాధీశుడైన న్యాయవర్ధన మహారాజు అసలు పేరు బలవర్ధనుడు. అయితే, అతడు న్యాయవిచారణ జరిపేతీరు, అత్యంత చాకచక్యంగా న్యాయాన్యాయనిర్ధా రణ చేసి తీర్పులిచ్చి, నిష్పక్షపాతంగా న్యాయాన్ని అమలు జరిపే విధానం, ప్రజల్లో అతడికి న్యాయవర్ధనుడన్న పేరు తెచ్చి పెట్టింది.

సుభద్ర దేశాన్ని ఆనుకుని వున్న భౌమ్య దేశపురాజు, న్యాయవర్ధనుడికి చిరకాల మిత్రుడు. ఆయనపట్ల అమితమైన గౌరవ మర్యాదలు కలిగినవాడు. అతడు, యుక్త వయస్కుడైన తన కుమారుడు కుమార కేతుడికి పట్టంకట్ట నిశ్చయించి, అతడితో, ''నాయనా! రాజు బాధ్యతలలో కెల్లా అతి ముఖ్యమైనది న్యాయపాలన. న్యాయవర్ధన మహారాజు మనకు ఆప్తమిత్రుడు. న్యాయ పాలనలో ఆయనఎంత గొప్పవాడో, ప్రజలు ఆయనకు న్యాయవర్ధనుడంటూ పెట్టిన పేరే చెబుతుంది. నువ్వు మన రాజ్యానికి రాజువు కాబోయేముందు కొన్నాళ్ళ పాటు, ఆ



మహారాజు శిష్యరికం చేసి రావటం నీకు చాలామేలుచేస్తుంది,'' అన్నాడు.

తండ్రి మాట చొప్పున కుమారకేతు, సుభద్ర దేశానికి వచ్చాడు. న్యాయవర్ధనుడు అతడిని కన్నబిడ్డలా ఆదరించి, ''నాయనా! నాకు తెలిసినదీ, న్యాయమని నేను నమ్మి పాటిస్తున్నదీ మొత్తం చెబుతాను, విను. రాజ్యమనేది ఒక పెద్దకుటుంబం వంటిది. రాజు ఆ కుటుంబపు పెద్ద. కుటుంబంలో పిల్లలమధ్యా , పెద్దలమధ్యా చిన్నా పెద్ద తగవులూ, కొట్లాటలూ ఎంత సహజంగా వుంటాయో, దేశప్రజల మధ్య కూడా అంతే సహజంగావుంటాయి. కుటుంబంలోఏవైనా కలహాలు రేగినప్పుడు, అవి అక్కడి కక్కడ సర్దుబాటు అయాయా సరేసరి! లేదా, తగవు పడ్డవాళ్ళు గొడవను కుటుంబ యజమాని



దృష్టికి తెస్తారు. అప్పుడు కుటుంబ ఐక మత్యం చెడకుండా తగవును పరిష్కరించే బాధ్యత యజమాని మీద పడుతుంది. అలాగే ,రాజ్యంలో చెలరేగే చిన్న చిన్న సాధారణ కలహాలను, నేరాలను ఆయా న్యాయాధికారులువిచారించి, తీర్పులు ఇస్తారు. వారికి కొరుకుడు పడనివాటినీ, అసాధారణ మనిపించినవాటినీ, రాజే స్వయంగా విచారించి నిష్పక్షపాతంగా న్యాయపాలన చెయ్యటం, రాజ్యపు ఆంత రంగిక క్షేమానికి ఎంతైనా అవసరం. న్యాయ పరిపాలన ద్వారా ప్రజాదరణకు పాత్రుడైన రాజుకు, ప్రజాబలమే వెయ్యి అక్షౌహిణుల సైన్యబలం!''అంటూ ఇంకా ఎన్నో విషయాలు విశదంగా వివరించి చెప్పి, '' రేపు నాతో బాటు సభకు వచ్చి, అక్కడ జరిగే న్యాయ విచారణ అంతా శ్రద్ధగా గమనించు. న్యాయం తాలూకు వివిధ సూక్ష్మరూపాలు నీకుబాగాఅర్థమవుతాయి ,'' అన్నాడు.

న్యాయవర్ధనుడి మాటలకు వినయంగా తల వూపిన కుమారకేతు, మర్నాడు సభలో న్యాయవర్ధనుడి సమీపంలోనే కూర్చుని మహారాజు తీర్పుకోసం వచ్చిన వారి వాదన లను శ్రద్ధగా వినటం ప్రారంభించాడు.

ఆరోజు విచారణకు వచ్చిన వాళ్ళు ముగ్గురు. వాళ్ళల్లో మొదటి ఫిర్యాదీ ఒక సామాన్య రైతు. అతడి పేరు వీరనందుడు. అతడుముద్దాయిగా పేర్కొంటున్న వ్యక్తి, అతడి స్నేహితుడు చంద్రన్న. సభకు అతడు కూడా వచ్చాడు.

రాజు అనుమతించగానే, మొదటిఫిర్యాదీ అయిన వీరనందుడు రాజుకునమస్కరించి ఇలా ప్రారంభించాడు:

''మహాప్రభూ! ఈ చంద్రన్నా, నేనూ చిన్నప్పటి నుంచీ స్నేహితులం. ఇద్దరం ఒకరి పట్ల మరొకరం ఎంతో అపేక్షగావుంటూ, ఒకరితో ఒకరువియ్యమందాలనికూడా, మా పెళ్ళిళ్ళు కాక ముందే వాగ్దానాలు చేసు కున్నాం. నాకు ముందు పెళ్ళిఅయి కొడుకు పుట్టాడు . 'నీకు అల్లుడు పుట్టాడురా,' అని నేనంటే దానికి ఈ చంద్రన్న ఆనందంగా అంగీకరించాడు. తర్వాత అతడికి పెళ్ళయి, మొదట కూతురే పుట్టింది. ఆ పిల్ల మా కోడలనుకున్నాం. దానికి చంద్రన్న పెళ్ళాం కూడా ఇష్టపడింది. నా కొడుకూ, ఆపిల్ల కూడా, ఎంతో స్నేహంగా వుంటూ పెరిగారు. ఇరు పక్షాల వాళ్ళం కూడబలుక్కుని, మా



నిపుణుల సలహా పొంది దానిని పాటించని వాడు; శాస్త్రాలన్నీ చదివి, ఆ జ్ఞానాన్ని జీవితంలో ఉపయోగించకుండా అప్పటికప్పుడే మరచిపోయే పండితుడికి సమానుడే.
- శుక్రాచార్యుడు.

కుల పెద్దల ముందు సంబంధం నిశ్చయం చేసుకున్నాం. పిల్లలు పెద్దవాళ్ళయిన తర్వాత పెళ్ళి చెయ్యాలని చంద్రన్న భార్య అంటే, దానికి నేనూ, మా ఆవిడా సరేనన్నాం. అంతే! ఆతర్వాత నుంచీ చంద్రన్న అదృష్టం బాగుండీ, అతను పట్టిందల్లా బంగారమైంది! ఆ ఒక్క ఆడ పిల్ల లక్ష్మి తప్ప మరి పిల్ల లు కూడా కలగలేదు. అంచేత, అతను వున్న నాలుగె కరాల పొలాన్నీ పది ఎకరాలుచేసి, క్రమంగా వూళ్ళోని పెద్ద భూస్వాముల్లో జత అయి పోయాడు.

ఇటు నా పరిస్థితి పూర్తివ్యతిరేకం అయి పోయింది. నాకు పెద్దపిల్లవాడు తర్వాత, మరొక ఐదుగురు పుట్టుకొచ్చారు. ఎంత సంపాదించినా, రెక్కలు ముక్కల వేయి గాని దమ్మిడీ కనబడేదికాదు. కష్టానికి సుఖానికి వున్న భూమికూడా తెగ నమ్ముకోవాల్సి వచ్చింది . మా బీదరికం చూసి, చంద్రన్నా, అతడి పెళ్ళామూ కాస్తకాస్త ఎడం జరగటం ప్రారంభించి, ఇప్పుడసలు పిల్లను, మా వాడి కిచ్చి పెళ్ళి చెయ్యనే చెయ్యం పొమ్మంటు న్నారు. చంద్రన్న డబ్బూదస్కం చూసి, మా కులపెద్దలుకూడా, అతడికే వత్తాసు పలుకు తున్నారు. ఎప్పుడో పిల్లల చిన్నతనాన్నిచ్చిన మాట చెల్లదు పొమ్మంటున్నారు. మహా రాజా! సంగతంతా ఇది. డబ్బుకోసం, ఆడిన మాట తప్పరాదని అతనికి బుద్ధిచెప్పి, లక్ష్మిని మా కోడల్ని చెయ్య మని ప్రార్థి స్తున్నాను!''

మామూలుగా ప్రారంభించి, వ్యంగ్యం లోకి దిగి, ఆవేశంగా ముగించాడు వీరనంద నుడు.

అతడి మాటలన్నీ శ్రద్ధగా విన్న మహా రాజు, చంద్రన్నవైపు చూసి, ''ఏం, చంద్రన్నా, నువ్వేమంటావు?'' అని ప్రశ్నించాడు.

—( ఇంకావుంది)





**ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు –**
**తరతరాలుగా సత్యంకోసం జరిగిన అన్వేషణ!**

## 7. వంశమూలం తెలియని ముని!

వేసవిసెలవులు ఆరంభం కావడంతో సందీపుడు, శ్యామల కథలు చెప్పమని తాతయ్య చుట్టూ తిరగసాగారు.

''మీరు చెప్పిన దండకారణ్యం కథ, అందులోని సంఘటనలు చాలా ఆసక్తికరంగా ఉన్నాయి తాతయ్యా!'' అన్నది శ్యామల తాతయ్య గదిలోకి ప్రవేశిస్తూ.

''అవునూ, పూర్వకాలంలో అరణ్యాలు విద్యాలయాలకు నిలయంగాకూడా ఉండేవికదా?'' అని అడిగాడు సందీపుడు తాతయ్య ఎదుట కూర్చుంటూ.

''నిజమే. అరణ్య ప్రాంతాల్లోనే ఆనాటి విద్యాలయాలైన గురుకులాలు ఉండేవి. ఎందుకంటే వాటిని నడిపిన గురువులు ఋషులు. ప్రశాంత అరణ్య వాతావరణంలో నివసించడానికే వాళ్ళు ఇష్టపడేవాళ్ళు. అయినా నదీతీరాలు, లోయలు వంటి, ఆహ్లాదకరమైన వాతావరణంలోనే గురుకులాలు నడిపేవాళ్ళు,'' అన్నాడు తాతయ్య దేవనాథుడు.

''ఆహా! ఆ గురుకులాలు ఎంత బావుండేవో!'' అన్నాడు సందీపుడు.

''ఎంత బావుండేవో అని మురిసిపోతున్నాడు అన్నయ్య. అలాంటి గురుకులాల్లో అతన్ని చేర్పిస్తే ఒక్కరోజుకూడా ఉండేవాడు కాదు,'' అన్నది శ్యామల.

''ఎందుకని?'' అని అడిగాడు సందీపుడు.

''అక్కడ బాడ్మింటన్ లేదుగా?'' అన్నది శ్యామల నవ్వుతూ.

''బాడ్మింటన్ లేకపోతే ఏం? నా స్నేహితులతో కలిసి దాగుడుమూతలాడేవాడిని. అలాంటి ఆట ఆడడానికి పట్టణాల్లో అవకాశం ఎక్కడిది?'' అన్నాడు సందీపుడు.

''ఆ రోజుల్లో బాడ్మింటన్, టెన్నిస్, క్రికెట్ లాంటి ఆటలు లేవు, నిజమే. అయినా శారీరక వ్యాయామానికి చక్కని క్రీడలు ఉండేవి. కుస్తీలు, ఈత, పరుగుపందాలు, చెట్టులెక్కడంవంటి ఆట



విశ్వావసు





లెన్నో ఉండేవి. శ్వాసక్రియను క్రమబద్ధం చేసి, శరీరాన్ని బంతిలా చురుగ్గాపని చేయించే అప్పటి చెడుగుడులాంటి ఆటలు ఈనాటికీ కొనసాగుతూనే ఉన్నాయి. ఇక క్షత్రియులయితే విలువిద్య, ఖడ్గవిద్య, కఱ్ఱసాము తప్పకనేర్చుకోవాలి!'' అన్నాడు తాతయ్య.

''క్షత్రియులకు మాత్రం అలాంటి ప్రత్యేకత ఎందుకు? అంటే, ఆనాడు కులవ్యవస్థ అంత పటిష్ఠంగా ఉండే దన్న మాటేగా?'' అని అడిగాడు సందీపుడు.

''కులవ్యవస్థఎప్పుడుఎలాఆరంభమయిందని ఇదమిత్థంగా చెప్పడానికి సరైన ఆధారాలు లేవు. కానిఒక్కటిమాత్రంనిజం.మనిషి ప్రవృత్తికీ, వృత్తికీ అంటే పుట్టుకతో వచ్చే స్వభావానికీ– చేసే పనికీ మధ్య సమన్వయం సమకూర్చడానికే అది ప్రవేశపెట్టబడింది. సాహసప్రియులుగొప్పగొప్ప పనులు చేయాలని తహతహలాడేవారు కొందరుంటారు. అలాంటి వారిని క్షత్రియులన్నారు. వర్తక వ్యాపారాలపట్ల ఆసక్తి కనబరచేవారిని వైశ్యులన్నారు. వ్యవసాయంపట్ల మక్కువచూపుతూ శరీర శ్రమ చేసేవారిని శూద్రులన్నారు. విద్య, పాండిత్యం; జ్ఞానం, ధ్యానం మొదలైన వాటిపట్ల శ్రద్ధాసక్తులు చూపేవారిని బ్రాహ్మణులన్నారు. పైన చెప్పిన వృత్తులన్నిటికీ సమానప్రాముఖ్యత ఇవ్వబడింది. బాగా ఆలోచించినట్టయితే ఇది వంశానుగతంగా వచ్చేదికాదని తెలుస్తుంది!'' అన్నాడు తాతయ్య.

''మరి ఆ తరవాత అది వంశపారంపర్యంగా ఎలా అయింది తాతయ్యా?'' అని అడిగాడు సందీపుడు.



''నిత్యావసర నిర్బంధాలవల్ల అలా తయారయింది. చదువుసంధ్యలు, పూజాపునస్కారాలు ఈ వాతావరణంలో పెరిగే పిల్లలలో సహజంగానే వాటిపట్ల శ్రద్ధాసక్తులు పెరిగాయి. ఖడ్గ విద్యనభ్యసించే తండ్రిని చూసే తనయుడిలో వాటిపట్ల ఆసక్తి కలిగి తానూ సులభంగా నేర్చుకోసాగాడు. తన విద్యను తనయుడికి నేర్పడంలో తండ్రికి కూడా ఆనందం వుంటుంది. మిగతా వృత్తి విద్యలకూ ఇదే వర్తిస్తుంది. కావాలంటే ఒక వృత్తివాళ్ళు వేరొక వృత్తిని నేర్చుకోవచ్చు; ఆ శ్రేణి లోకి వెళ్ళవచ్చు గనక, ఇంతవరకూ ఇందులో తప్పేమీ కనిపించదు. వృత్తులమధ్య, వాటిని చేసే కులాల మధ్య తరతమ భేదాలు, హెచ్చుతగ్గుల భావాలు వేళ్ళు పాకడంతోనే



ఈవ్యవస్థ దురవస్థ పాలయింది. లోపమంతా స్వార్థమానవస్వభావంలోనే, అంటే అహంభావం లోనే ఉన్నది. మానవ హృదయం అహంకారానికి అతీతంగా ఎదిగే మంచిరోజులు వస్తాయని ఆశిద్దాం!'' అన్నాడు తాతయ్య.

''ఒక వృత్తికి సంబంధించిన వ్యక్తి, వేరొకవృత్తికి



మారిన ఉదాహరణలు ఏవైనా ఉన్నాయా?'' అని అడిగింది శ్యామల.

''కొకొల్లలు. ఈ ఆదర్శం వంశపారంపర్యం కాక ముందు ఇలాంటి మార్పులు వేనవేలు జరిగి ఉంటాయి. అది వంశ పారంపర్యంగా మారిన తరవాత కూడా ఎంతో ఉదారంగా వ్యవహరించే వాళ్ళు. ప్రజలందరూ పూజ్యభావంతో చూసిన ఋషులు, వ్యక్తుల స్వభావాలను పరిశీలించి, వారు ఏశ్రేణికి చెందిన వారుగా వుండాలో నిర్ణయించే వారు. అలాంటి ఉదంతాలు చాలా వుండి వుండాలి. అలాంటి ఒక ఉదంతానికి సంబంధించినపసివాడు ఉత్తరోత్తరా గొప్పమునిగా పరిణమించడంవల్లఆసంఘటనఒక ఉపనిష త్తులో నమోదై ఉన్నది!'' అన్నాడు తాతయ్య.

''దాన్ని గురించి చెప్పండి, తాతయ్యా!'' అన్నారు శ్యామల, సందీపుడు ఉత్సాహంతో ఒక్కసారిగా.

తాతయ్య కథ చెప్పడం ప్రారంభించాడు:

అరణ్య సమీపంలోఒకపేదరాలూ,పసివాడైన ఆమె కొడుకూ నివసిస్తూండే వాళ్ళు.వాళ్ళుండే గుడిసె నానుకుని చిన్న నది ప్రవహిస్తూండేది. నదికి ఆవలి తీరంలో గౌతమముని నడిపే గురు కులం ఉండేది.

ఆ పేదరాలి కొడుకు నదిలోస్నానంచేసేప్పుడు ఆవలితీరంలో తనఈడుపిల్లలుస్నానం చేయడం చూసేవాడు. గురువువారికి వేదమంత్రాలువల్లించే విధానంవివరించేవాడు. గాయత్రీమంత్రాన్ని ఎలా జపించాలో చెప్పేవాడు. సూర్యనమస్కారం ఎలా చేయాలో చేసి చూపేవాడు. తాను కూడా ఆ గురుకులంలో చేరి మిగిలిన పిల్లల్లాగే చదువు కోవాలని ఆశపడ్డాడు ఆ కుర్రవాడు. ఆ కోరికను తన తల్లితో చెప్పాడు. ''మంచిది నాయనా! నువ్వు గురువుదగ్గరికి వెళ్ళి శిష్యుడిగా చేర్చుకోమని ప్రార్థించు,'' అని సలహా ఇచ్చింది తల్లి.

ఆ కుర్రవాడుమరునాడే నదిలోఈదుకుంటూ ఆవలిగట్టు చేరాడు. గురువుకు నమస్కరించి తన కోరికను విన్నవించాడు. ఆ పసివాడి వినయ విధేయతలకూ, జ్ఞానదాహానికీ గురువు సంత సించాడు. అతడికి తగిన శిక్షణ ఇవ్వాలంటే వాడి తల్లిదండ్రులెవరో తెలుసుకోవాలికదా? అందు వల్ల. ''నీకులమేమిటి నాయనా?'' అని అడిగాడు ముని. ''నాకు తెలియదు,'' అన్నాడు కుర్రవాడు.

''మీ తల్లిని అడిగి తెలుసుకునిరా?'' అన్నాడు ముని.



అక్కడినుంచిబయలుదేరివెళ్ళిమరునాడు గురుకులానికి తిరిగివచ్చినకుర్రవాడు, "నాతండ్రి ఏకులం వాడో మాతల్లికీ తెలియదట?" అన్నాడు.

''ఫరవాలేదు. నీ తండ్రి పేరైనా చెప్పు,'' అన్నాడు ముని.

'' అదీ తెలియదు!''అన్నాడు కుర్రవాడు.

''మీ తల్లిని అడిగిరా,''అన్నాడు ముని.

మరునాడు గురుకులానికి తిరిగివచ్చినకుర్ర వాడు, మందహాసంతో చూస్తూన్నగురువుకు నమస్కరించి,''స్వామీ, సేవకురాలిగా మాఅమ్మ చాలా ఇళ్ళల్లో పనిచేసింది. అలా ఒక ఇంట్లో పని చేస్తున్నప్పుడు,అదే ఇంట్లో పనిచేస్తున్న ఒక సేవకుడితో పెళ్ళయిందట. దురదృష్టవశాత్తు ఒక దుర్ఘటనలో ఆయనా,ఇంటియజమానులూ చని పోయారు. మా తల్లి మాత్రమేమిగిలింది. నేను పుట్టినప్పటి నుంచి అడవి సమీపంలోని గుడిసెలో వుంటూ; అడవిలో లభించే ఫలాలనూ, కట్టెపుల్ల లనూ అమ్ముకుంటూ మా అమ్మ కాలం వెళ్ళ బుచ్చుతున్నది,''అన్నాడు.

''నాయనా,నీ కులం తెలిసి పోయింది. నువ్వు బ్రాహ్మణుడివి!''అన్నాడు గురువు అతన్ని ఆశీర్వ దిస్తూ.

''వాడు, బ్రాహ్మణుడని మీకెలా తెలిసింది?'' అని అడిగాడు పక్కనే నిలబడ్డ ఒకఆశ్రమవాసి.

''బ్రాహ్మణుడంటే ఎల్లప్పుడూ సత్యం పలికే వాడు. అంటే ఏ పరిస్థితిలోనైనా నిజం చెప్పేవాడే నిజమైనబ్రాహ్మణుడు. ఈ పసివాడుగాని,ఇతని తల్లిగాని కావాలంటే అబద్ధం చెప్పివుండవచ్చు. అందుకు చాలా అవకాశం ఉన్నది. అయినా వాళ్ళలా చేయలేదు. నిజాన్నిదాచకుండానిర్భ యంగా చెప్పే నిజాయితీ వాళ్ళలో ఉన్నది. కాబట్టే, అతన్ని బ్రాహ్మణుడన్నాను,''అని వివ రించాడు ముని.

ఆ కుర్రవాడితల్లి అతనికేమి పేరు పెట్టిందో తెలియదు. ముని అతనికి సత్యకాముడని నామకరణం చేశాడు. సత్యకాముడి తల్లి పేరు జాబాలి. అందువల్ల ఆయన ఉత్తరోత్తరా సత్య కామ జాబాలుడుగా ప్రసిద్ధి గాంచాడు.

''సమాజం మీద మన మునుల ప్రభావం చాలా గొప్పది!''అన్నాడు సందీపుడు.

''మరొక ముఖ్యవిషయం కూడా గుర్తుం చుకోవడం అవసరం. ముని అన్నవాడు కులా లన్నిటికీ అతీతుడు!'' అన్నాడు తాతయ్య దేవనాథుడు. —(ఇంకావుంది)





# కర్ణభేది పాటగాడు

భీమతరంగిణి రాజ్యంలో, వీరభద్రుడు, స్వర్ణలక్ష్మి అనే రైతు దంపతులుండేవారు. వాళ్ళకు చాలాకాలం వరకు సంతానం కలగ లేదు. స్వర్ణలక్ష్మి ఎన్నో వ్రతాలూ, పూజలూ చేయగా చేయగా, అవి ఫలించి ఒక మగ బిడ్డను ప్రసవించింది.

కంటికి ఇంపుగా వున్న, ఆ బిడ్డను చూసి మంత్రసాని సంతోషించేలోపుగా, వాడు గుక్కపట్టి ఏడ్చాడు. ఆ ఏడుపు విన్న మంత్ర సానికి గుండెలో దడపుట్టింది. ఆ ఏడుపు అంత కర్ణకఠోరంగా వున్నది. స్పృహలో లేని స్వర్ణలక్ష్మికి కూడా, ఆ ఏడుపువల్ల చప్పున స్పృహవచ్చింది. ఆ వికృతమైన శబ్దం ఎక్కడి నుంచి వస్తున్నదా అని చూసిన ఆవిడకు, ఆబిడ్డ తను కన్న పసికందని తెలిసి విస్తు పోయింది.

వీరభద్రుడు, తన కొడుకు వికృత స్వరం గురించి తెలుసుకుని మనసులో దిగులు పడినా, అది పైకి కనబరచకుండా భార్యకు ధైర్యం చెప్పాడు.

ఆ రైతు దంపతులు కొడుక్కు రామశేఖ రుడని పేరు పెట్టుకున్నారు. వయసు పెరుగు తున్నకొద్దీ వాడికంఠస్వరంమరింత వికృతంగా తయారైంది. వాడుకోపంవచ్చిఅరిస్తే భూమి దద్దరిల్లుతున్నదేమో అనిపించేది.

వీరభద్రుడు, కొడుకును బడిలోచేర్చాడు. వాడిగొంతు విని బడిలో కొందరు పిల్లలు జ్వరం తెచ్చుకున్నారు. మరి కొందరు వాణ్ణి అంత దూరాన చూస్తేచాలు, చెప్పలేని భయంతో వణికి పోసాగారు.

బడిపంతులు, ఒకనాడు వీరభద్రుణ్ణి కలిసి జరిగింది చెప్పి, ''అయ్యా! నాకు జీవనోపాధి బడి ఒక్కటే. మీరు, రామశేఖరుణ్ణి బడికి పంపితే, నా కడుపుకొట్టిన వారవుతారు. దయచూపండి!'' అని కాళ్ళు పట్టుకున్నాడు.

దానితో వీరభద్రుడు, కొడుకును బడికి పంపడం మానుకున్నాడు. ఇప్పుడు, రామ శేఖరుణ్ణి ఏమిచేయడమాఅనిఅతడు విచార పడుతూండగా, ఆఊరుకు శార్దూలపాదు డనే, ఒక బక్కచిక్కిన సన్యాసివచ్చాడు.

ఎన్. శివనాగేశ్వరరావు

అతడుగొప్ప మహిమలు కలవాడని క్షణాల మీద ఊరంతా పాక్కిపోయింది.

వీరభద్రుడు, కొడుకుతోపోయి సన్యాసిని కలుసుకుని, ''స్వామీ! వీడు నాకొక్కడే కొడుకు; పేరురామశేఖరుడు. దేవుడు వీడికి కర్ణకఠోరమైన కంఠస్వరాన్నిచ్చాడు. బడిలో పిల్లలు వీడిగొంతువిని జ్వరాల పాల య్యారు. మీరే దయచూపాలి!'' అని దీనంగా ప్రార్థించాడు.




శార్దూలపాదుడు, రామశేఖరుడి హస్త రేఖలు పరిశీలించి, ''వీడికి ఇరవయ్యో ఏట గొప్ప యోగం వున్నది. వీడి పాటవల్ల ఒక మహత్కార్యం సాధించబడుతుంది. వీడి తలమీద కనకవర్షం కురుస్తుంది. నా మాట తప్పదు!'' అన్నాడు.

ఇది విన్న వీరభద్రుడు, ఏమీతోచక తల గోక్కుంటూ ఇంటిదారి పట్టాడు. గొంతు వింటేనే కంపరం పుట్టే రామశేఖరుడు, గొప్ప పాటగాడెలా అవుతాడో అతడికి ఏమాత్రం అర్థంకాలేదు.

ఒకవారంపాటు ఆలోచించివీరభద్రుడు, కొడుక్కు పాటలుపాడడంలో శిక్షణ ఇప్పించి చూద్దామనుకున్నాడు. అతడు పొరుగూరిలో వున్న, గానామృత పాణి అనే గాయకుడి దగ్గ రకు కొడుకునుతీసుకుపోయి, ''అయ్యా, వీడికి పాటలుపాడడం నేర్పండి. ప్రతి ఫలంగా తమరు కోరినది ఇచ్చుకుంటాను,'' అన్నాడు.

గానామృతపాణి రామశేఖరుడికి ఒక కీర్తన పాడి వినిపించి, అలా పాడమన్నాడు. రామ శేఖరుడు వెంటనే గళం విప్పాడు. అంతే! ఆకాశం ఉరిమి పిడుగులు పడినట్లయింది.

గానామృతపాణి తన అరచేతిని రామశేఖ రుడి నోటికి అడ్డంపెట్టి, ''నాయనా! చిన్నవాడి వైపోయావు. లేకపోతే నీ కాళ్ళు పట్టుకునే వాణ్ణి. నాకసలే గుండెపోటు. నీవుపాట ఆపక పోతే, ఈక్షణమే నాకు భూమ్మీద నూకలు చెల్లిపోతాయి,'' అని వేదనతో కంట నీరుపెట్టు కున్నాడు.

''నాకు పాట సగంలో ఆపడం ఏమాత్రం ఇష్టముండదు!'' అన్నాడు రామశేఖరుడు కోపంగా.

''నన్ను కనికరించి పాటసగంలో ఆపి నందుకు, నీకు జన్మాంతం రుణపడివుంటాను. నీకు ఎవరో పాట నేర్పనవసరం లేదు. కర్ణుడు సహజకవచకుండలాలతో పుట్టినట్టునువ్వు జన్మతః పాటగాడివిగా పుట్టావు,'' అన్నాడు గానామృతపాణి.



అతడిమాటల్లోని వెటకారంవీరభద్రుడికి అర్థమైంది. రామశేఖరుడు మాత్రం, తనకు పాటలు పాడడంలో సంపూర్ణమైన ప్రతిభ అలవడినట్టు ఆనందపడిపోయాడు.

ఊరుచేరాక, వీరభద్రుడు, రామశేఖరుడికి, ''ఒరే,నువ్వుగొప్పగాపాడతావని, మన ఊళ్ళోనీపాటవిన్నవాళ్ళకునీమీదఅసూయ కలగవచ్చు. అందువల్ల, నువ్వు నీ పాటను జనం మధ్య పాడకుండా, ఎవరూ లేని ప్రాంతాలకు పోయి, అక్కడ సాధన చెయ్యి,'' అని సలహా యిచ్చాడు.

ఈ సలహా రామశేఖరుడికి నచ్చింది. వాడొకనాడు ఊరుకు దూరంగా వున్న ఒక కొండ ప్రాంతానికిపోయి, ఒకరాతి మీద కూర్చుని గొంతు విప్పాడు. ఆ ఊరి పూజారి శఠగోపానికి మూలికావైద్యంలో ప్రవేశముంది. ఆయన మూలికల కోసం కొండ దగ్గరకు వచ్చి, రామశేఖరుడి కర్ణభేది లాంటి పాటవిని హడలిపోయాడు.

ఆయన, వాణ్ణి దగ్గరకు పిలిచి, ''ఒరే, శేఖరం! దూరంనుంచి నీపాట విని, ఆకాశం నుంచి ఏ గంధర్వుడో కిందకు దిగి పాడుతున్నాడనుకున్నాను, తీరాచూస్తే నువ్వు! మన మహారాజుగారిని దర్శించి నీ గంధర్వ గానం వినిపించు. నీకు ఘనసన్మానం తప్పక చేస్తారు,'' అన్నాడు.

ఆ మాట నమ్మిన రామశేఖరుడు, మరెవ్వరితో చెప్పకుండా, రాజుగారివద్దకు బయలు దేరాడు.

అదే సమయంలో, ఆ రాజ్యం రాజు సుప్రభాతుడు, ఒక చిక్కుసమస్యతో కొట్టు మిట్టాడుతున్నాడు. పొరుగుదేశపు రాజు చండమార్తాండుడు హఠాత్తుగా సుప్రభాతుడి రాజ్యంపై దండయాత్రకు బయలుదేరాడు. పులి మీద పుట్రలా, సుప్రభాతుడి సేనాపతికి విషజ్వరం సోకింది.

సుప్రభాతుడు ఏంచేయాలో పాలుపోక తలపట్టుకు కూర్చున్నాడు. అంతలో ఒక భటుడు వచ్చి, ''మహారాజా! రామశేఖరుడనే పాటగాడు వచ్చాడు. తన పాటతో మీకు వీనుల విందుచేస్తాడట! పంపమనిసెలవా?'' అని అడిగాడు.

రాజు పంపమన్నట్టు తలవూపాడు. రామశేఖరుడు, రాజు దగ్గరకు వచ్చి నమస్కరించి, గొంతెత్తిపాట ప్రారంభించాడు. అది వింటూనే సుప్రభాతుడు అదిరిపడ్డాడు. శత్రురాజు నగరం మీద శతఘ్నులు పేల్చడం ఆరంభించాడని కలవరపడిపోయాడు. అంతఃపురం



లోని మహారాణులు, భీమతరంగిణీ నది గట్లు తెగి హఠాత్తుగా వరదవచ్చినట్టు బెంబేలెత్తిపోయారు.

ఆగ్రహించిన సుప్రభాతుడు, రామశేఖరుడి నాలుక తెగనరికించాలని భావించాడు. కాని అంతలోనే ఆయనకు మరొక ఆలోచన వచ్చింది. రాజ్యానికి ఉత్తర దిశలో గల అరణ్యంలో, ఒక మహారాక్షసుడు తిరుగుతున్నట్టు వార్తలు అందాయి.

ఈ సంగతి గుర్తురాగానే, సుప్రభాతుడు చప్పట్లు చరిచి భటులను పిలిచి, ''ఒరే, ఈ కర్ణభేది పాటగాణ్ణి వెంటనే తీసుకుపోయి, ఉత్తరదిశలో వున్న మహారణ్యంలో వదిలి రండి. అక్కడవున్న రాక్షసుడు వీణ్ణి నిలువునా విరుచుకు తింటాడు. అదే వీడికి తగిన శిక్ష!'' అన్నాడు.

రాజాజ్ఞ ప్రకారం భటులు, రామశేఖరుణ్ణి అరణ్యంలో వదిలి, చప్పున అక్కడి నుంచి నగరం కేసి పారిపోయారు. ఇంత జరిగాక రామశేఖరుడికి ఒక సంగతి అర్థమైంది. రాజన్నట్టు తను నిజంగా కర్ణభేది పాటగాడు! తను గొంతెత్తి పాడడం ప్రారంభిస్తే, ఎంతటి వాడైనా, ఆ భీకర కఠోరధ్వనిని తట్టుకోలేడు. అలాంటప్పుడు, ఈరాక్షసుడు మాత్రం తన ధాటికి ఆగగలడా?

రామశేఖరుడు ఇలాఆలోచిస్తూండగా, ఎదురుగా వున్న చెట్ల కొమ్మలను తొలగదోస్తూ, చేతిలో పొడవాటి రాతి గదతో, మదపుటేనుగులా వున్న రాక్షసుడొకడు బయటికి వచ్చి, రామశేఖరుణ్ణి చూస్తూనే, ''ఆహాః, ప్రాణంతో వున్న నరమానవుణ్ణి చూసి ఎంత కాలమాయె!'' అంటూ పెద్ద పెద్ద అంగలతో ముందుకు రాసాగాడు. రామశేఖరుడు, రాక్షసుణ్ణి అంత కన్న వాడి చేతిలోవున్న ఆరేడడుగుల రాతిగదనూ చూసి ముందు భయపడినా, తర్వాత మొండి ధైర్యం తెచ్చుకుని, ''ఓహో విధిబలీయం అన్నమాట నిజం కదా! ఈ రాక్షసాధముడికి, నావల్ల చావు రాసిపెట్టి వున్నదన్న మాట,'' అని, పెద్దగా గొంతెత్తి పాట ప్రారంభించాడు.

ఆ పాట వినబడగానే రాక్షసుడు నడుస్తున్న వాడల్లా ఆగి, ఒక క్షణం అటూ ఇటూ తూలి బోర్లాపడిలేస్తూ, ''ఒరే, పాటఆపు! చెవిగూబల్లో శూలాలతో పొడిచినట్టున్నది,'' అన్నాడు.

అదివిన్న రామశేఖరుడు, రాక్షసుడి నుంచి తన కెలాంటి ప్రమాదంరాదనీ, తను వాణ్ణి నానాహింసలూ పెట్టవచ్చనీ ధైర్యం



మనిషికి స్వగృహంలో తల్లి తోడు; పరదేశంలో తాను నేర్చిన విద్యే తోడు; రోగగ్రస్తుడైనప్పుడు ఔషధమే తోడు; మరణసమయంలో ధర్మమే తోడు.

—కౌటిల్యుడు

తెచ్చుకుని, "ఒరే, నేను కర్ణభేది పాటగాణ్ణి! నా పాట సాంతం వినందే నిన్ను వదలను," అంటూ ముందుకురికాడు.

ఇది చూసి రాక్షసుడు, ఒక చావుకేక పెట్టి పారిపోసాగాడు. రామశేఖరుడు మరింత బిగ్గ రగా పాటపాడుతూ, వాణ్ణి వదలకుండా తరమసాగాడు.

అదేసమయంలో శత్రురాజు చండమార్తాం డుడు, భీమతరంగిణి రాజ్యంపైకి సైన్యంతో, ఆ మార్గాన వస్తున్నాడు. పర్వతాకారుడైన రాక్షసుడు పరుగుతీస్తూ తమవైపు రావడం చూసి, సైనికులు బెంబేలెత్తిపోయారు.

ఇది చూసి చండమార్తాండుడు భయ కంపితుడై– భీమతరంగిణి రాజ్యంలోని ఒక సామాన్యపౌరుడే, రాక్షసుణ్ణి వెంటబడి తరు ముతుంటే, ఇక ఆరాజ్యసైనికులు మరెంత వీరాధి వీరులై వుంటారో అనుకుని, వెంటనే గుర్రాన్ని వెనక్కు తిప్పి పారిపోయాడు.

ఈ లోపల రాక్షసుడు, రామశేఖరుడి కర్ణభేదిపాట నుంచి తప్పించుకోవడానికి దారిలో ఎదురైన సైనికులను, తన రాతిగదతో అందినవాణ్ణి అందినట్టు కొడుతూ, "వింధ్య పర్వతాలెక్కడ?" అంటూగుట్టలూ పుట్టల మీది నుంచి కుప్పించి దూకుతూ పరి గెత్తాడు.

ఈ జరిగినదంతా, రాజు సుప్రభాతుడికి గూఢచారుల ద్వారా తెలిసింది. రాజ్యానికి యుద్ధప్రమాదం తప్పిపోవడానికి కారణం రామశేఖరుడి కర్ణభేది పాటేనని ఆయన గ్రహించాడు.

ఆ రోజే రాజు, రామశేఖరుణ్ణి మంగళ వాయిద్యాలతో సభకు ఆహ్వానించి, కనకా భిషేకం చేయడమే కాక, ఇక బతికుండగా ఏనాడూ పాటపాడనని ప్రమాణం చేయించి, ఆస్థానంలో మంచి ఉద్యోగం ఇచ్చాడు. అందరూ ఎంతో సంతోషించారు.



మన కావేరీ తీర ప్రయాణంలో తరవాతి ముఖ్యమైన మజిలీ అయిన కుంభకోణానికి వెళ్ళే మార్గంలో కంజానూర్, తిరువిసనల్లూర్ అనే పట్టణాలు ఉన్నాయి. కంజానూర్ ఒకప్పుడు చేనేత చీరలకు చాలా ప్రసిద్ధి గాంచింది. హాస్య ప్రదర్శన, అనుకరణలలో దిట్ట అయిన వికటం రామస్వామి శాస్త్రియార్; సంఘసంస్కర్తా, భక్తుడూ అయిన శ్రీధర్ అయ్యా అనే ఇద్దరు ప్రముఖుల కారణంగా తిరువిసనల్లూర్ పేరుగాంచింది. శేష జీవితాన్ని ప్రశాంతంగా ప్రార్థనలతో, ధ్యానంతో గడపాలన్న మహదాశయంతో, శ్రీధర్ అయ్యా మైసూరు సంస్థానంలో నిర్వహిస్తున్న మంత్రిపదవిని వదులుకుని తిరువిసనల్లూర్ చేరుకున్నాడు. ఆయనలోని కరుణ, మానవత్వం అపారమైనవి. అందువల్ల ప్రజలు ఆయన్ను గౌరవంతో 'అయ్యా వాళ్' అని పిలిచేవారు.

---

## కావేరీ తీర ప్రయాణం-10

# దక్షిణ కాశి

రచన: జయంతి మహాలింగం ★ చిత్రాలు: గౌతమ్ సేన్

---

తన తల్లికి శ్రాద్ధకర్మలు నిర్వర్తించడానికి, ఒకసారి శ్రీధర్ అయ్యా కొందరు బ్రాహ్మణులతో కలిసి కావేరీ తీరానికి బయలుదేరారు. దారిపక్కన ఒక హరిజనుడు ఆకలితో అలమటిస్తూ పడివుండడం ఆయన చూశాడు. వెంటనే వెనుతిరిగి వెళ్ళి తల్లి శ్రాద్ధ కర్మల కోసం ఇంట్లో తయారుచేసిన వంటలను ఆ మనిషికి పంపాడు. ఈ చర్య బ్రాహ్మణులకు ఆగ్రహం తెప్పించింది. శ్రాద్ధకర్మకురాకుండా వెళ్ళిపోయారు. మౌనంగా వాళ్ళ కేసి చూస్తూ నిలబడ్డ అయ్యా, వారికి బదులు నాలుగు దర్భపోచలను వుంచి, స్వయంగా తల్లికి శ్రాద్ధకర్మలు జరిపి పూర్తి చేశాడు.

కుంభకోణాన్ని 'కావేరీ తీర కాశి' అని అంటారు. కావేరీకి దక్షిణ తీరంలో వెలసిన కుంభకోణం వద్దే అరసలార్ అనే ఉపనది కావేరీలో కలుస్తున్నది. తొమ్మిదవ శతాబ్దారంభం నుంచే ఈ నగరం మత, సాంస్కృతిక, ఆర్థిక కార్యకలాపాలకు కేంద్రంగా వుంటున్నది. పట్టుప్రత్తి చేనేత పరిశ్రమలకూ; కంచుపోత పనులకూ, ఇత్తడి పాత్రలకూ, బంగారు నగల తయారీకి ఈ నగరం ఎంతో ప్రసిద్ధిగాంచింది. ఇక్కడి 'చిత్ర కళాశాల' చాలామంది చిత్రకారులనూ, శిల్ప కారులనూ రూపొందించింది. సౌరాష్ట్ర నుంచి వచ్చి ఇక్కడ స్థిరపడిన చేనేత కార్మికులు, తమవెంట తెచ్చిన జరీనేతను ప్రవేశపెట్టారు. గుజరాతీ వర్తకులు కూడా ఇక్కడికి వచ్చి



ఆదికుంభేశ్వర దేవాలయం




స్థిరపడ్డారు. ఇక్కడి ప్రభుత్వ కళాశాలలో చదువుకున్న పలువురు గొప్ప పండితులుగా పేరొందడం వల్ల దీనిని దక్షిణ భారత కేంబ్రిడ్జ్ అని గొప్పగా చెప్పుకునేవారు.

కుంభకోణంలో దాదాపు అరవైకి పైగా దేవాలయాలు ఉన్నాయి. నగరం నడిబొడ్డులో వున్న ఆదికుంభేశ్వరాలయం కారణంగానే దీనికి కుంభకోణం అనే పేరు వచ్చింది. ఈ ఆలయానికి సంబంధించిన స్థలపురాణం ఒకటి ప్రచారంలో ఉన్నది. జగత్ ప్రళయం రాబోతున్న సమయంలో పరమశివుడు సృష్టికి కావలసిన సకల దివ్య విత్తనాలనూ బ్రహ్మ కిచ్చి, వాటినొక అమృతకుంభంలో భద్రపరచి, బిల్వపత్రాలతో పూజించి, ప్రళయ కాలంలో మేరుపర్వతం మీద ఉంచమన్నాడట. ప్రళయకాలంలో ఆ కుంభం (కుండ) నీళ్ళపై తేలుతూ ఈ ప్రాంతానికి వచ్చింది. శివుడు దానిని బాణంతో కొట్టాడు. కుండలోని అమృతం, విత్తనాలు చెల్లా చెదరయ్యాయి.అందులోని అమృతం కొంత మహామహపుష్కరిణిలోనూ, మరికొంత బంగారు తామర తటాకం (పొర్ర్టామరై కుళం)లోనూ పడింది. శివుడు ఇసుకను అమృతంతో కలిపి లింగాన్ని రూపొందించి అందులో లీనమయ్యాడు. ఇది సృష్ట్యాదిలో జరగడం వల్ల దీనికి 'ఆది' (ప్రథమ)కుంభేశ్వర ఆలయం అనే పేరు వచ్చింది.

9000 చ.మీ. విస్తరించివున్న ఆదికుంభేశ్వర ఆలయమే కుంభకోణంలోని పెద్ద దేవాలయం. దీనికి మూడు ద్వార గోపురాలు ఉన్నాయి. క్రీ.శ. 7వ శతాబ్దం నుంచి ఈ ఆలయానికి సంబంధించిన చరిత్ర ఉన్నది. అప్పర్, సంబందర్ వంటి మహనీయులు ఈ ఆలయాన్ని దర్శించి 'తేవార' భక్తిగీతాలతో దేవుణ్ణి స్తుతించారు. 16, 17 శతాబ్దాలలో విజయనగర నాయకరాజులు ఈ దేవాలయప్రాంగణంలో మరిన్ని ఆలయాలు నిర్మించారు. అచ్యుతప్ప నాయకుడి ఆస్థానంలో మంత్రిగా పనిచేసిన గోవిందదీక్షితర్ మహామహపుష్కరిణి చుట్టూ, మిగిలిన తటాకాల దాపులలో, బావుల వద్దా 16 మంటపాలు నిర్మించాడు. ఆయన గొప్ప పండితుడు, తత్వవేత్త, మానవతావాది, నిష్కామ కర్మయోగి. ఆయన్ను అందరూ అయ్యన్‌అని ఆప్యాయంగా చెప్పుకునే వారు. కుంభకోణంలోని అయ్యన్ కుళం (తటాకం) అయ్యన్‌తెరు (వీధి) అయ్యన్ కడై(అంగడి) మొదలైన స్థలాలు, ఆయన కీర్తిని ఇప్పటికీ చాటుతూనే వున్నాయి.

కుంభకోణంలో వున్న చోళుల కాలానికి చెందిన మరొక ముఖ్యమైన ఆలయం నాగేశ్వర దేవాలయం. ఇది 9వ శతాబ్దానికి చెందినది. తొలినాటి చోళుల శిల్పకళా నైపుణ్యానికి దీనిని విశిష్ట ఉదాహరణగా చెప్పవచ్చు. శివ

లీలలనూ, రామాయణ ఘట్టాలనూ చిత్రించే అందమైన కుడ్య శిల్పాలు గర్భ గృహ కుడ్యంలో చెక్కబడి ఉన్నాయి.

చోళుల కాలానికి చెందిన విష్ణువుకు సంబంధించిన ఏకైక మందిరం అందమైన శ్రీసారంగపాణి దేవాలయం. ఇక్కడి మూలవిగ్రహం పడుకున్న భంగిమలో దర్శన మిస్తుంది. ప్రధానగర్భగృహం ఉరికేగుర్రాలూ, ఏనుగులూ పూన్చిన రథాకృతిలో ఉన్నది. ఈ ఆలయానికి నాయక రాజులు తొమ్మిది అంతస్థుల గోపురాన్ని నిర్మించి మరింత శోభను సమకూర్చారు.



మహామహ పుష్కరిణి (తటాకం)

కుంభకోణానికి 5కి.మీ. దూరంలోని దారాసురంలో చోళులు రథాకృతిలో నిర్మించిన మరొక ఆలయమైన ఐరావతేశ్వర ఆలయం ఉన్నది. శిల్పకారుల శిలాస్వప్నంగా దీనిని అభివర్ణిస్తారు. అందమైన గుర్రాలు లాగుతూన్న బ్రహ్మాండమైన రథంలా కనిపిస్తుంది ఆలయం. ఆలయంలోని చిత్రాలు, శిల్పాలు, అపురూప కళాఖండాలుగా భాసిస్తున్నాయి. ఆలయం ముందున్న కొన్నిస్తంభాలను తడితే నాదం పుడుతుంది. దారాసురం పాలైయారై చోళుల రాజధాని.

ఐరావతేశ్వర ఆలయంలోని కుడ్యశిల్పాలు



ఉత్తర భారతదేశంలో జరిగే కుంభమేళాలాగా ఇక్కడ పన్నెండేళ్ళ కొకసారి మహామహ ఉత్సవాలు భారీఎత్తున జరుగుతాయి. ఆ పుణ్యదినాన భారత దేశంలోని పుణ్య నదులన్నీ అంతర్వాహినులుగా వచ్చి, కావేరీలో కలుస్తాయని భక్తులు విశ్వసిస్తారు. ఆ శుభ ఘడియలో మహామహ పుష్కరిణిలో పుణ్యస్నానం చేయడానికి భక్తులు అసంఖ్యాకంగా వస్తారు. ఆ సమయంలో భక్తుల తలలు తప్ప చుక్కనీరు కనబడనంతగా జన సమ్మర్దం వుంటుంది. 1992 ఫిబ్రవరిలో చివరి సారిగామహా మహ ఉత్సవాలు జరిగాయి.

కుంభకోణానికి సమీపంలోని కొట్టయూర్, పాపనాశం, స్వామిమలై (అందమైన సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ఆలయం), ఉమయాళ్పురం, కపిస్థలం, సీర్గాళి మొదలైన కావేరీ తీర గ్రామాలు ఎందరో సంగీత విద్వాంసులకూ, వాగ్గేయకారులకూ జన్మ స్థలాలుగానో, నివాసస్థానాలుగానో ప్రసిద్ధి గాంచాయి. కొట్టయూర్ పలువురు ఆళ్వార్లకూ, నాయనమార్లకూ;



మరెందరో పండితులకూ, సంగీతకారులకూ జన్మనిచ్చింది. సంగకాలానికి చెందిన ప్రాచీన తమిళ రచనలను సేకరించి వెలుగులోకి తెచ్చిన మహామహోపాధ్యాయ యు.వి. స్వామినాథ అయ్యర్ (1855 - 1942) ఇక్కడే జన్మించాడు. ఈనాటికీ ఆయన్ను 'తమిళ్ తాత్తా' అని కీర్తిస్తారు. ఆయన గురువు మహావిద్వాన్ టి.పి.మీనాక్షిసుందరం పిళ్ళై; నందన్ చరిత్రం రచించిన గోపాలకృష్ణ భారతి; తమిళభాషలో తొలినవల అయిన ప్రతాపముదలియార్ చరిత్రం రాసిన వేదనాయగం పిళ్ళై మొదలైన వారందరూ కావేరీ తీరంలో పుట్టి, ఆ నదీ జలాలను తాగి పెరిగినవారే. యు.వి. స్వామినాథ అయ్యర్ చాలా సంవత్సరాలు కుంభకోణం కళాశాలలో తమిళ ఉపన్యాసకులుగా పనిచేశారు.

కుంభకోణంలో జన్మించిన మరొక మేధావి సుప్రసిద్ధ గణిత శాస్త్రవేత్త శ్రీనివాస రామానుజం. ఆయన ఇక్కడే చదువుకున్నాడు. ఆ తరవాత భారతదేశంలో జన్మించిన అతిగొప్ప గణితశాస్త్ర మేధావిగా అంతర్జాతీయ ఖ్యాతినార్జించాడు.

కుంభకోణం దాటాక కావేరీ తిరుభువనం గుండా ప్రవహిస్తుంది. ఇక్కడి కంబహరేశ్వర దేవాలయాన్ని చోళుల శిల్పకళా నైపుణ్యానికి ప్రత్యేక ఉదాహరణగా చెబుతారు. ద్వార గోపురం మీది విమానశిఖరాలు మలినాటి చోళుల ఆలయాలకన్నా భిన్నంగా ఉన్నాయి. మొదట కనిపించే మంటపం దారాసురం గుడిలాగా రథాకృతిలో ఉన్నది. ఇది మూడవ కులోత్తుంగ చోళుడి (1178 - 1218) కాలంలో నిర్మించబడింది.

మహామహోపాధ్యాయ
యు.వి. స్వామినాథ అయ్యర్

ఇక్కడినుంచి మరికొన్ని కి.మీ.దూరంలో వున్న తిరువిడై మరుదూర్ మహాలింగేశ్వరర్ ఆలయాన్ని తమిళనాడులోని అతిపెద్ద దేవాలయాలలో ఒకటిగా చెబుతారు. ఇక్కడ వున్న 'మరుదమరం' అనే స్థలవృక్షం కారణంగా దీనికీ పేరు వచ్చింది. ఎత్తయిన గోపుర శిఖరాలతో, సువిశాలమైన ప్రాకారాలతో వెలసే బ్రహ్మాండమైన దేవాలయం ఇది. లోపలి గోడలలో 1200 సంవత్సరాల నాటి శిలా శాసనాలు ఉన్నాయి. అప్పర్, సంబందర్, మాణిక్కవాచగర్ వంటి శివభక్తులు ఆలయంలోని శివుడి మహిమను కొనియాడుతూ గీతాలు రచించారు.



శ్రీనివాస రామానుజం

కావేరీ తరవాతి మజిలీ మాయూరం అనబడే 'మయి లాడు త్తురై' నెమళ్ళు నాట్యమాడే ప్రాంతం అని దీనికి అర్థం. తలకావేరీకి తరవాత పవిత్రమైనదిగా చెప్పుకునే 'లాకూడా స్నానఘట్టం' ఇక్కడ ఉన్నది. అక్టోబర్-నవంబర్ మధ్య వచ్చే 'కడైముఖం' పర్వదినాన ఇందులో స్నానం చేయడానికి భక్తులు అసంఖ్యాకంగా వస్తారు.

కావేరీ నది ప్రశస్తిని కీర్తించే 'పట్టిణప్పాళై' వంటి ప్రాచీన గ్రంథాలలో, గీతాలలో 'మాయూరం' గురించిన ప్రస్తావన ప్రముఖంగా కనిపిస్తుంది.



# పిశాచాల పగ

చింతలపూడి అనే గ్రామంలో, సూరన్న అనే యువకుడుండేవాడు. వాడికి తల్లీ తండ్రీ గాని, దగ్గర బంధువులంటూగాని ఎవరూ లేరు. వాడు గ్రామంలో ఎక్కడ ఏ శుభాశుభ కార్యాలు జరిగినా, అన్ని పనులూ భుజాన వేసుకుని, ఎక్కడా చిన్న పొరబాటు జరక్కుండా నిర్వహించుకు వచ్చేవాడు. అంతే కాక, రాత్రివేళ-పొలిమేరలో వున్న పంట పొలాలమీద దాడిచేసే అడవిపందుల్నీ; మేకలనూ, గొర్రెలనూ చంపితినే తోడేళ్ళనూ ఒంటరిగాపోయి తరిమికొట్టేవాడు.

ఒకనాడు గ్రామ పండితుడు వెంకటశాస్త్రి, సూరన్నను పిలిచి, ''ఒరే, సూరన్నా! నువ్వు విన్నావో లేదో, ఈమధ్య ఎక్కడినుంచి వచ్చాయెూ, అడవిలోని చింతలతోపులో రెండు పిశాచాలు వచ్చితిష్ఠవేశాయి. పట్నం నుంచి అడ్డదారిన వచ్చే మనగ్రామంవాళ్ళను, అవి గడగడలాడిస్తున్నాయి. రాజుగారు సకుటుంబ పరివార సమేతంగా రేపు సాయంత్రం ఏదో మొక్కుబడి తీర్చుకునేందుకు జోగులాదేవి ఆలయానికి వస్తున్నారు. ఆయనది కాస్త చపలచిత్తం; అన్నీ నిలకడలేని ఆలోచనలు. అయినా, ఆ పిశాచాలు వారిలో ఎవరికీ హాని కలిగించకుండా చూశావంటే, కోట లో నీకు మంచి ఉద్యోగం ఇప్పించే పూచీ నాది,'' అన్నాడు.

వెంకటశాస్త్రి చెప్పిందంతా శ్రద్ధగా విన్న సూరన్న, కాసేపు మౌనంగా వూరుకుని ''అయ్యా, నాకు మన ఈ గ్రామంలోనే సుఖంగా వుంది. రాజుగారి కోటలోఉద్యోగం చెయ్యాలని లేదు. అయినా, రాజుగారు మన గ్రామం వస్తున్నారంటే, మన అతిథి గదా! ఆ పిశాచాల గొడవేదో నేను తేలుస్తాను,'' అన్నాడు.

సూరన్న, ఆనాటి అర్ధరాత్రి అడవిలోని చింతలతోపుకుపోయేసరికి, పాడుబడిన ఒక బావి గట్టుమీద కూర్చున్న రెండు పిశాచాలు కనిపించాయి. వాటిలో ఒకటి బాగా పొడవు, బక్కచిక్కి వున్నది. రెండోది పొట్టిగా, లావుగా వున్నది. రెండూ మధ్య మధ్య

మాచిరాజు కామేశ్వరరావు



వికవికమని నవ్వుతూ కబుర్లాడు తున్నవి. సూరన్న ఒక చెట్టు చాటున దాక్కుని వాటి మాటలు వినసాగాడు.

"ఈ పొగరుబోతు రాజు వేటకంటూ లోగడ మనం వుంటున్న కొలను ప్రాంతానికి భటులను తరచూ వెంటబెట్టుకుని వస్తూండ డంతో, మనం అంత చక్కని ప్రదేశం వదిలి, ఈ చింతలతోపులోని పాడుబడ్డ బావిగట్టు చేర వలసి వచ్చింది," అన్నది పొడవాటి పిశాచం.

"ఆహాఁ, ఇదొక అద్భుత అవకాశం! జార విడవకూడదు. ఒక్కరాజేమిటి, అతడి వెంట వున్నవాళ్ళందర్నీ హతమార్చవలసిందే!" అన్నది పొట్టిపిశాచం.

ఆ తర్వాత ఎవరేం చేయాలన్న విష యంమాట్లాడుకుని, రెండు పిశాచాలూ ఒక నిర్ణయానికి వచ్చినై. పొడవాటి పిశాచం, రాజు గారి రథం గ్రామపొలిమేర దాటి, పక్కనున్న కొండమలుపు తిరిగేటప్పుడు, రథంమీదికి కొండపైనుంచి పెద్దబండరాయిని దొర్లిస్తుంది. ఒకవేళ రాజుప్రమాదంనుంచిబయటపడితే గ్రామంలో ఆయనకు జరిగే సన్మాన సభా వేదికను,రాజుతోపాటుకాల్చిబూడిదచేస్తుంది పొట్టిపిశాచం.

ఆ తర్వాత పిశాచాలు రెండూ కొంతసేపు మౌనంగా కూర్చున్నవి. పొడవాటి పిశాచం హఠాత్తుగా తనకేదో కొత్త ఆలోచన వచ్చిన దానిలా ఎగిరి గంతేసి, "ఒకవేళ రాజు ఈ రెండు ప్రమాదాలనుంచీ బతికి బయటపడి కోటకు వెళ్ళిపోతే, మనం అలా చూస్తూ వూరుకోవడమేనా," అన్నది.

"ఊరుకోం గాక, ఊరుకోం!" అంటూ పొట్టిపిశాచం గట్టిగా చప్పట్లు చరిచి, రెండో పిశాచంతో, "రాత్రి రాజు భోజనం ముగించి వక్కపొడి కోసం దంతం భరిణెమూత తీయ గానే, నువ్వు అందులో కర్కోటకజాతి మండ్ర గబ్బగా వుండి కుట్టేస్తావు," అని, ఒక క్షణం ఆగి, "ఇక నేనా!రాణీగారు పూల కోసం బుట్టలో చేయి పెట్టగానే, అక్కడ రెండు తలల మిన్నాగుగా వుండికాటేస్తాను!" అన్నది.

"ఆహా! తిరుగులేని ఉపాయం! మన పగ సగంతీరిపోయినట్టే," అన్నది పొడవాటి పిశాచం.

మర్నాటి సాయంకాలం సూరన్న కొండ మలుపుదాటి, గ్రామపొలిమేర దగ్గర నిల బడ్డాడు.అంతలో రాజువెనక పరివారం రాగా రథంలో అక్కడికి చేరాడు. సూరన్న , రాజు కునమస్కరించి తనకు తానుగా పరిచయం చేసుకుని, రథం తోలేవాడితో, "ఈ కొండ మలుపు చాలా ప్రమాదకరమైనది. మలుపు తిరుగుతూనేరథాన్ని రెట్టింపువేగంతో తోలడం

క్షేమం.రాజుగారికి ఇక్కడ ఏదైనా ప్రమాదం జరగవచ్చునినాకేదో భయంగా వున్నది,'' అన్నాడు.

రాజూ, రథం తోలేవాడూ ఇదివినిఆశ్చర్య పోతూండగా,వెనక నాలుగుగుర్రాలుపూన్చిన బండిలోవస్తున్న ముసలిమంత్రి కల్పించుకుని,''మహారాజా, ఇదిమనకు బొత్తిగా తెలియని ప్రాంతం. అతడు చెప్పినట్టు చేయడం మేలు,'' అన్నాడు.

రాజుగారిరథంకొండమలుపుదగ్గరవేగంగా ముందుకు దూసుకుపోతూండగా, పెద్ద కొండరాయిదొర్లివచ్చి బాటమధ్యపడింది. ఇది చూసిఅందరూనివ్వెరపోయారు.

మంత్రీసేనాధిపతీరాజుతో,''మహారాజా, ఈసూరన్న వల్లనే తమకుప్రాణాలు దక్కాయి. ఇతణ్ణి ఘనంగా సన్మానించ వలసిందే!'' అన్నాడు.

''అవశ్యం! అవశ్యం!'' అన్నాడు రాజు మీసం మెలిపెట్టుకుంటూ.

ఆ తర్వాత రథంగ్రామం చేరింది.అక్కడ రాజూరాణీ, యువరాణినీ సన్మానించేందుకు గ్రామస్థులు ఒక వేదిక కట్టారు. సూరన్న రాజుతో,''మహారాజా, మీముగ్గురూ వేదికపై వున్న ఆసనాల్లో కూర్చోకండి. వేదిక ఎక్కుతూనే ఆవలివైపుకు దిగిపోండి. లేకపోతే ఘోర ప్రమాదం జరుగుతుంది,''అన్నాడు.

ఈ లోపల పొట్టిపిశాచం వేదికకింద కూర్చుని, దానికి నిప్పుపెట్టడానికి తయారవుతున్నది. రాజకుటుంబం వేదికమీది ఆసనాలను సమీపించగానే, ఆ పని చెయ్యాలని దాని ఆలోచన. అది, ముగ్గురూ వేదిక ఎక్కి ఆసనాలను సమీపిస్తూండగా, వాళ్ళు వాటిల్లో కూర్చుంటారనుకుంటూ, ''రాజ



కుటుంబం నిలువునా భస్మం!'' అంటూ నిప్పులు ఊదింది.

అయితే, రాజకుటుంబం ఆసరికే వేగంగా వేదిక దిగి, దూరంగా వెళ్ళిపోయింది. ఆ మరుక్షణంవేదికనిప్పంటుకునిభగ్గున మండిపోయింది. ఇలా ఎందుకు జరిగిందో అర్థంకాక, గ్రామప్రజలు హాహాకారాలు చేశారు.

ఈ సంఘటన జరిగాక సేనాధిపతి, సూరన్న కేసి ఒకసారి అనుమానంగా చూసి, రాజుతో, ''చూడబోతే, ఈ సూరన్న మాయలమారిలా వున్నాడు. లేకపోతే, జరగబోయే ఘోరప్రమాదాలన్నీ ముందే ఇతగాడికి ఎలా తెలుస్తున్నాయి? ఈప్రమాదాలన్నీ వీడిపన్నాగమేనేమో, మహారాజా!'' అన్నాడు.

''నాకూ అలాగే అనిపిస్తున్నది. వీణ్ణి బంధించండి!''అన్నాడు రాజు.



భటులు, సూరన్నను పట్టుకోబోయేంత లో గ్రామపెద్ద కల్పించుకుని, ''మహారాజా! ఈ సూరన్నను మేము బాలుడుగావున్నప్పటి నుంచీ ఎరుగుదుము. వాడు గొప్ప పరోప కారి. మాయలూ, మంత్రాలూ నేర్చినవాడు కాదు,'' అన్నాడు.

గ్రామాధికారి ఇలా అనగానే, సేనాధిపతి అతడికేసి కోపంగా చూసి, ''నువ్వు గ్రామ పెద్దవెలా అయ్యావో, నాకు తెలియడం లేదు. మాయలూ మంత్రాలూ నేర్వాలను కున్నవాడు, ఆసంగతి ముందుగానే పది మందికీ చెప్పడు. ఈ చుట్టుపక్కలవున్న అడవుల్లోనూ, కొండలూకోనల్లోనూ చాలా మంది మంత్రవిద్యలునేర్చిన బైరాగులూ, సన్యాసులూ వున్నారని నేను విన్నాను. ఈ సూరన్న రహస్యంగారాత్రివేళ, వాళ్ళ దగ్గరకు పోయి అన్నిరకాల క్షుద్రవిద్యలూ నేర్చు కుని వుండాలి. సమయం వచ్చినప్పుడు వాటి ద్వారా లాభపడేందుకు, గ్రామంలోనే వుంటూ పరోపకారిలా నటిస్తున్నాడు. ఇప్పుడు మహారాజుగారు ఈ ప్రాంతాలకు రావడంతో, ఆ క్షుద్రవిద్యలన్నీ ఆయన మీదప్రయోగించి, ఆయన మెప్పు పొందా లని చూస్తున్నాడు. తరచిచూస్తే, ఈ సూరన్న ఆస్థానంలో ఏదో పెద్దపదవికోసం ఇదంతా చేస్తున్నట్టు కనబడుతున్నది,'' అన్నాడు.

సూరన్న, సేనాధిపతి అన్న కటువుమాట లేమీపట్టించుకోకుండా, ఎంతో శాంతంగా, ''మహారాజా! ఈరాత్రి తమరూమహారాణి గారూ రాజభవనంలోనే రెండు దుష్ట పిశా చాల కారణంగా ప్రమాదాలకుగురి కాబో తున్నారు. నేను పక్కన వుంటే తప్ప, మీరిద్దరూ ఆ ప్రమాదాల నుంచి బయట పడలేరు,'' అన్నాడు.

సేనాధిపతిఏదోఅనబోయేంతలో మంత్రి, ''మహారాజా, ఈ సూరన్నను తమ భవనానికి తీసుకుపొండి. రాత్రి రానున్న ఆ ప్రమాదాల సంగతి కూడా ఏమిటో తెలిసిపోతుంది,'' అన్నాడు.

దానికి రాజు అంగీకరించాడు. రాజుతో పాటు సూరన్న రాజభవనంచేరాడు. రానున్న ప్రమాదా లేమిటో తెలుసుకునేందుకు మంత్రీ, సేనాధి పతీ కూడా రాజ భవనానికి వెళ్ళారు.

రాత్రి రాజు భోజనం ముగించి, వక్కపొడి కోసం దంతపు భరిణను తీసుకోబోయాడు. సూరన్న ఆయనను ఆగమని, తానే భరిణ తీసుకుని మూత తెరిచి, లోపలి నుంచి కర్కో టకజాతిమండ్రగబ్బరూపంలోవున్న పొడవాటి పిశాచి తలఎత్తేంతలో మూత బిగించాడు.

అలాగే రాణిగారు పూలబుట్టలోంచి పూలు తీసుకునేందుకు వెళ్ళగానే, ఆమెనువారించి తనే బుట్టమూత తెరిచాడు. లోపల రెండు తలల మిన్నాగురూపంలో వున్న పొట్టి పిశాచం బుసలు కొడుతూ తల ఎత్తేంతలో, బుట్ట మూతమూసేశాడు.

ఇదిచూసి అందరూ భయంతో వణికి పోయారు. సూరన్న రాజుతో, ''చూశారా! మహారాజా, వీటిని మీకు తెలియకుండా భవనంలోకి వచ్చి, నేను ఏర్పాటు చేయలేను కదా. మీ భటులనుపిలిచి, ఈ పిశాచాలున్న భరిణనూ, బుట్టనూఅరడుగులలోతుగోతిలో భూస్థాపితం చెయ్యమనండి!'' అన్నాడు.

ఇదంతా చూసిన యువరాణి, ''నాన్నా, ఇంతధైర్యశాలీ, తెలివిమంతుడూ మనరాజ్యానికి సేనాధిపతిగా వుండదగినవాడు!'' అన్నది.

''అవును! సూరన్నా, ఈక్షణంనుంచే నువ్వు ఈ రాజ్యానికి సేనాధిపతివి,'' అన్నాడురాజు.

''నిజానికి ఇంతటి బుద్ధిశాలి మీకు మంత్రిగా వుండడం బావుంటుంది,'' అన్నది రాణి.

''అవును! సూరన్నా, ఈక్షణంనుంచే నువ్వు రాజ్యానికిమంత్రివి,'' అన్నాడు రాజు.

తమ పదవులకు గండం పట్టేలా వుండడంతో గుండెలు జారిపోయిన మంత్రీ, సేనాధిపతీ కూడబలుక్కుని, ''మా దృష్టిలో ఈవీరుడు, మీతదనంతరంసింహాసనం ఎక్కడానికి అర్హుడు. యువరాణి వారికి తగిన వరుడు,'' అన్నారు.

''నాకా సంగతి తట్టనే లేదు! మీ సూచన అమోఘం,'' అన్నాడు రాజు, సూరన్ననూ, యువరాణినీ మార్చిమార్చి చూస్తూ.

అప్పుడు, సూరన్న మనసులోనే, రాజు సొంత ఆలోచన బొత్తిగా లేనివాడు. ఇటువంటి వాడిదగ్గర వుండడం ప్రమాదం అనుకుని, ''క్షమించండి, మహారాజా! ఎట్టి పరిస్థితులలోనూ గ్రామం విడిచి వెళ్ళనని, మరణశయ్య మీద వున్న మా నాన్నకు మాట ఇచ్చాను!'' అంటూ అక్కడినుంచి బయలుదేరాడు.

తమ పదవులకు ముప్పుతప్పినందుకు సంతోషిస్తూ మంత్రీ, సేనాధిపతీ ఏకకంఠంగా, ''మహారాజా, తండ్రికిచ్చిన మాట నిలబెట్టుకోవటం, కొడుకుగా సూరన్న ధర్మం!'' అన్నారు.

''అవునవును, ధర్మం,'' అన్నాడు రాజు తలాడిస్తూ.



# ఇబ్బంది!

కృష్ణాపురంలో నీటిఎద్దడి ఎక్కువ. కిష్టయ్య అనేవాడు, దూరాన వున్న చెరువునుంచి బిందెలతో నీళ్ళు తెచ్చి, గ్రామంలో వున్న పది కుటుంబాల వాళ్ళకు పోస్తూండేవాడు. అందుకుగాను, ప్రతి ఇంటి యజమాని నుంచి పది రూపాయలు తీసుకునేవాడు. కిష్టయ్య పనిలో నిజాయితీపరుడు. ఏనాడూ పని ఎగగొట్టి ఎరగడు.

ఒకసారి కాలిలో ముల్లు గుచ్చుకుని, నడవలేక వాడు పది కుటుంబాల వాళ్ళకూ, నీళ్ళు తెచ్చి పొయ్యలేకపోయాడు. విషయం తెలిసిన గ్రామస్థులు, నెలాఖరున వాడికి డబ్బిచ్చేటప్పుడు మామూలుగానే పదిరూపాయలు ముట్టజెప్పారు. వీరేశం అనే గ్రామస్థుడు మాత్రం, కిష్టయ్యకు ఒక రూపాయి తగ్గించి ఇచ్చాడు. ఈ వీరేశం గ్రామంలో పేరు మోసిన పరమ పిసినారి. అందుకు కిష్టయ్య, ''అయ్యా, నేనేనాడూ, పనిమాని ఎరగను. కాలిలో ముల్లు గుచ్చుకొని నీళ్ళు తేలేకపోయాను. అందుకు రూపాయి తగ్గించి ఇవ్వడం న్యాయం కాదు,'' అన్నాడు. అందుకు వీరేశం, ''నీ ఇబ్బందితో నాకేంపని?'' అనేశాడు.

తర్వాత కొద్ది రోజులకు, వీరేశం ఇంటికి బంధువులొచ్చారు. అది తెలిసిన కిష్టయ్య నీళ్ళుపోయడం ఎగ్గొట్టాడు. కోపగించిన వీరేశం, '' నీళ్ళు పోయకపోతే మాకెంత ఇబ్బంది!'' అంటూ రుసరుసలాడాడు.

అప్పుడు కిష్టయ్య, ''అయ్యా, మీ ఇబ్బందితో, నాకేం పని? కావాలంటే రూపాయి తగ్గించు కోండి!'' అన్నాడు.

వీరేశం మారుమాట్లాడ లేకపోయాడు.

- ఎన్. లలిత



54. శ్వేతుడి మరణం

# మహాభారతం

మొట్టమొదటగా యుద్ధానికి తలపడిన వాడు భీముడు. అతను భయంకరమైన సింహనాదంచేసి కౌరవసేన మీదికివచ్చాడు. అతన్ని దుర్యోధన, దుశ్శాసన, దుర్ముఖ, దుస్సహాదులు అనేక మంది చుట్టుముట్టారు. వాళ్ళ నందరినీ ఉపపాండవులూ, అభిమన్యుడూ, నకులసహదేవులూ, ధృష్టద్యుమ్నుడూ మొదలైన వాళ్ళు ఎదుర్కొన్నారు. ఇలా ఆరంభమైన యుద్ధం అన్ని రంగాలకూ వ్యాపించింది.

మొట్టమొదటగాద్వంద్వయుద్ధం భీష్ముడికీ, అర్జునుడికీ మధ్యజరిగింది. ఎవరూ ఎవరికీ తీసిపోకుండా యుద్ధంచేశారు. ఆ వెంటనేసాత్యకి కృతవర్మతోనూ, అభిమన్యుడు బృహద్బలుడి(కోసల రాజు) తోనూ, భీముడు దుర్యోధనుడితోనూ, దుశ్శాసనుడు నకులుడితోనూ, దుర్ముఖుడు సహదేవుడితోనూ, ధర్మరాజు శల్యుడితోనూ, ధృష్టద్యుమ్నుడు ద్రోణుడితోనూ ధృష్టకేతువు బాహ్లికుడితోనూ, ఘటోత్కచుడు అలంబుసుడితోనూ, శిఖండి అశ్వత్థామతోనూ, విరాటుడు భగదత్తుడితోనూ, ద్రుపదుడు సైంధవుడి తోనూ ద్వంద్వ యుద్ధాలు చేశారు. ఎవరూ ఎవరినీ ఓడించలేదు. ఎవరూ ఓడలేదు.

దొమ్మియుద్ధంకూడావిస్తారంగా జరిగింది. మొత్తం యుద్ధంలో భీష్ముడు వీరవిహారం చేసి, అందరికన్న ఎక్కువగా రాణించాడు. మిట్టమధ్యాహ్నం కావస్తూ ఉండగా ఆయన పాండవసేనలోజొరబడ్డాడు. ఆయనవెంట రక్షకులుగా దుర్ముఖుడూ, కృతవర్మా, కృపుడూ,





యుద్ధంలో శల్యుడికి వెంట్రుక వాసిలో చావు తప్పింది. అయితే శ్వేతుణ్ణి భీష్మడి నుంచి కాపాడటానికి పాండవయోధులు గొప్ప ప్రయత్నం చేశారు. దీని ఫలితంగాఉభయ పక్షాల యోధుల మధ్య తీవ్రమైన దొమ్మి యుద్ధం జరిగింది. మిగిలిన కౌరవ యోధులను పారిపోగొట్టిన శ్వేతుడు భీష్మడికి ఎదురుగా నిలిచి గొప్ప యుద్ధం చేశాడు. శ్వేతుడు ఆ సమయంలో అడ్డుపడక పోతే భీష్మడుపాండవసేనను విపరీతంగా ధ్వంసం చేసి ఉండేవాడు. అతను భీష్మడితో యుద్ధం చెయ్యటమే గాక, భీష్మడు వెనక్కు తిరిగి పోయేటట్టు కూడాచేశాడు.

పాండవులు ఉత్సాహంతో హర్ష ధ్వానాలు చేశారు.

భీష్మడు వెనక్కుతగ్గగానే శ్వేతుడు ధృతరాష్ట్రుడి కొడుకులున్న చోటికి వచ్చాడు. అతను కౌరవసేనను ధ్వంసం చేస్తూ ఉండటం చూసి భీష్మడు మళ్ళా అతన్ని ఎదుర్కొన్నాడు. భీష్మడికి అండగా, ఎనిమిది మంది కౌరవ యోధులు వచ్చి శ్వేతుడిపై బాణవర్షం కురిపించారు. శ్వేతుడు అంతమందినీ ప్రతిఘటించి పోరాడుతూ, భీష్మడికి చెయ్యీ, కాలూ ఆడకుండా చేశాడు. చూసేవారికి భీష్మడు ఓడిపోతాడనే అనిపించింది. వారిద్దరి మధ్యా జరిగిన యుద్ధంలో శ్వేతుడి రథం ధ్వంసం అయింది. భీష్మణ్ణి చంపటానికి గద తీసుకుని శ్వేతుడు అతని రథం మీదికి వచ్చాడు. అతను విసిరిన ఆ గదతో భీష్మడి రథం చూర్ణమయింది.

కాని అలా అవుతుందని తెలిసి భీష్మడు అంతకు ముందుగానే రథం దిగి, మరొక

శల్యుడూ, వివింశతీ ఉన్నారు. భీష్మడు తమసేనను నాశనం చేస్తూ రావడం చూసి అభిమన్యుడు అలిగి, భీష్మడిపై తలపడి, భీష్మడి జండా పడగొట్టి, భీష్మడి వెంటఉన్న యోధులందరితోనూ భయంకరంగా యుద్ధం చేసి అపర అర్జునుడనిపించాడు. త్వరలోనే అభిమన్యుడికి అండగా భీముడూ, విరాటుడూ, అతని కొడుకులూ, సాత్యకీ, ధృష్టద్యుమ్నుడూ మొదలైన వారు పది మంది యోధులు వచ్చారు.

ఉత్తరుడు ఒక ఏనుగు నెక్కి శల్యుడి మీదికి వచ్చాడు. ఇద్దరికీ జరిగిన యుద్ధంలో ఉత్తరుడు దెబ్బతిని పడిపోయాడు. అది చూసి ఉత్తరుడి అన్న అయిన శ్వేతుడు ఒకేసారి ఏడుగురు కౌరవ యోధులను ఎదుర్కొని, భయంకరమైన యుద్ధం చేశాడు. ఆ

రథం మీద ఎక్కి అతివేగంగా శ్వేతుడి పైకి వచ్చాడు.

శ్వేతుడు రథం పోగొట్టుకుని నేలమీద నిలబడిఉండటంచూసిసాత్యకీ, భీముడూ, అభిమన్యుడూ మొదలైన అనేకమంది యోధులు అతనికిఅండగావచ్చారు. అయితే భీష్ముడు వారినందరిని దూరానే నిలవ గొట్టాడు. తరవాత భీష్ముడు ప్రయోగించిన ఒక్క బాణం శ్వేతుడి ప్రాణాలు లాగేసింది. మహారథుడూ, పాండవ సేనాపతులలో ఒకడూ అయిన శ్వేతుడి మరణం పాండవులకు తీరని దుఃఖమూ, కౌరవులకు అమితానందమూ కలిగించింది.

శ్వేతుడు చావగానే అతని తమ్ముడు శంఖుడనే వాడు మండిపడి, కృతవర్మ వెంట ఉన్న శల్యుడిపైకి యుద్ధానికి వచ్చాడు. ఏడుగురు కౌరవ యోధులు శల్యుడికి అండగా వచ్చారు. శంఖుడిపైకి భీష్ముడు మృత్యుదేవతలాగా వచ్చి పడ్డాడు. అర్జునుడు శంఖుడికి తోడువచ్చాడు. శల్యుడు శంఖుడి రథాన్ని విరగగొట్టేసరికి శంఖుడు అర్జునుడి రథం ఎక్కాడు.

భీష్ముడు అర్జునుణ్ణి విడిచిపెట్టి ద్రుపదుడిపైకి వెళ్ళి, ద్రుపదుడి సేనను కార్చిచ్చులాగా తన బాణాలతో నాశనం చేయసాగాడు. ఆ సమయంలో భీష్ముణ్ణి చూసి పాండవ వీరులు వణికిపోయారు.

అంతలో సూర్యాస్తమాన మయింది. ఉభయ పక్షాల వారూ యుద్ధం చాలించి తమ తమ శిబిరాలకు వెళ్ళిపోయారు. భీష్ముడు చేసిన దారుణ యుద్ధానికి దుర్యోధనుడు పరమానందం చెందాడు. కాని ధర్మరాజు మొదటి రోజు తమకు కలిగిన నష్టానికి విచారిస్తూ కృష్ణుడి వద్దకు వెళ్ళి, "భీష్ముడెంత యుద్ధం చేశాడు! మన సేనను ఎండు గడ్డిని దహించినట్టు ధ్వంసం చేశాడు గదా! భీష్ముణ్ణి



జయించటం ఎవరివల్ల అవుతుంది?ఆయనను ఎదిరించటం నాదే బుద్ధి తక్కువ. కృష్ణా, అరణ్యాలకు పోయిసుఖంగాబతుకుతాను. ఈరాజులందరికీ చావు తప్పించిన వాణ్ణి అవుతాను. రాజ్యకాంక్షనన్నీదుస్థితికితెచ్చింది. నా తమ్ములందరూగాయపడ్డారు. బతికిఉన్నంత కాలమూ తపస్సు చేసుకుంటాను. నాకు కర్తవ్యం ఏమిటో వెంటనే చెప్పు. యుద్ధంలో అర్జునుడు తటస్థంగా ఉంటున్నాడు. భీముడొక్కడే తెగబడి యుద్ధం చేస్తున్నాడు. భీష్ముడి చేతిలో మాకందరికి చావురాసిపెట్టి ఉన్నది,'' అని శోకంలో మతిచెడిమాట్లాడాడు.



కృష్ణుడు ధర్మరాజును ఓదార్చుతూ, "నువ్వు ఇలా దిగులు పడటం భావ్యం కాదు. నీ తమ్ములు త్రిలోకశూరులు. సాత్యకీ, విరాటుడూ, ద్రుపదుడూ, ధృష్టద్యుమ్నుడూ లాంటి మహారథులు అనేక మంది నీకు అండగా ఉన్నారు. నీకు విచారం దేనికి? శిఖండి భీష్మణ్ణి చంపటానికి పుట్టినవాడే గద!'' అన్నాడు.

అప్పుడు ధర్మరాజు ధృష్టద్యుమ్నుడితో, ''నిన్ను సేనాపతిగా చేయమని కృష్ణుడు మమ్మల్ని ఆదేశించాడు.అందుచేతనువ్వుకౌరవ సేనలను సంహరించాలి. నీ వెనక మేమంతా ఉంటాము,'' అన్నాడు.

దానికి ధృష్టద్యుమ్నుడు, ''రాజా, నేను ద్రోణుణ్ణి చంపటానికి పుట్టినవాణ్ణి. భీష్మణ్ణీ, ద్రోణుణ్ణీ, కృపుణ్ణీ, శల్యుణ్ణీ, మిగిలిన అందరు యోధులనూ నేను ఇప్పుడు ఎదుర్కొంటాను,'' అన్నాడు.

''క్రౌంచవ్యూహం శత్రువులను నాశనం చేస్తుందట. దేవాసురయుద్ధ మప్పుడు ఇంద్రుడికి బృహస్పతి ఆ వ్యూహం చెప్పాడట. రేపు మన సేనను క్రౌంచవ్యూహంలో నిలబెట్టు,'' అన్నాడు ధర్మరాజు.

మర్నాడుతెల్లవారింది. రెండోరోజు యుద్ధానికి పాండవసేన క్రౌంచవ్యూహంలో నిర్మించబడింది. దానికి ముందు ఈరోజు అర్జునుడు నిలిచాడు. ఈ వ్యూహానికి తల వద్ద ద్రుపదుడు తన సేనలతో నిలిచాడు. ధర్మరాజు తోకవద్దా, భీమ ధృష్టద్యుమ్నులు రెక్కల స్థానంలోనూ ఉన్నారు. సూర్యోదయం కాక పూర్వమే వ్యూహం తయారై, యుద్ధానికి సిద్ధమయింది.

పాండవసేన క్రౌంచవ్యూహంలో ఉండటంచూసి, భీష్మద్రోణులూ, దుర్యోధనాదులూ కలిసి తమ సేనకు ప్రతి వ్యూహం పన్నారు. అందులో వివిధ యోధులు వేరు



వేగు స్థానాలలో ఉన్నారు. ఉభయసేనలూ మహోత్సాహంతో శంఖాలూ, భేరీలూ మోగించి యుద్ధానికి తలపడ్డాయి.

యుద్ధం ఆరంభమవుతూనే భీష్ముడూ, అభిమన్యుడూ, భీముడూ, అర్జునుడూ, విరాటుడూ, ధృష్టద్యుమ్నుడూ మొదలైన పాండవ పక్ష యోధుల మీద బాణవర్షం కురిపించాడు. పాండవవ్యూహం చెదిరిపో సాగింది. అర్జునుడు మండిపడి, తన రథాన్ని భీష్ముడి కేసి నడపమని కృష్ణుడితో చెప్పాడు. అతను భీష్ముణ్ణి చంప నిశ్చయించాడు. కపి ధ్వజమూ, అనేక పతాకలూ కలిగిన అర్జు నుడి రథం భీష్ముడి కేసి పోతూంటే, దారిలో అంతులేని కౌరవ సేనను అర్జునుడు చంపాడు.

అదిచూసి భీష్ముడు అర్జునుడికి ఎదురు వచ్చాడు. ఆయన వెంట రక్షకులుగా సైంధవుడు మొదలైన వీరులు అనేక మంది వచ్చారు. అర్జునుడి మీద భీష్ముడితో పాటు ద్రోణుడూ, కృపుడూ, దుర్యోధనుడూ, శల్యుడూ, అశ్వత్థామా, వికర్ణుడూ కూడా బాణాలు వేశారు. బాణాల దెబ్బలు తిని కూడా చలించక అర్జునుడు తిరిగి అందరినీ తన బాణాలతో నొప్పించాడు. అర్జునుడికి సహాయంగా సాత్యకీ, విరాటుడూ, ధృష్ట ద్యుమ్నుడూ, ఉపపాండవులూ, అభిమన్యుడూ యుద్ధం లోకి వచ్చారు. ద్రోణుణ్ణి అర్జునుడి నుంచి తప్పించటానికి ద్రుపదుడు ఆయన మీదికి వెళ్ళాడు.

అప్పుడు దుర్యోధనుడు భీష్ముడి వద్దకు వెళ్ళి, ''తాతా, అర్జునుడు మన సేనలను ధ్వంసం చేస్తున్నాడు. నీ మూలంగా కర్ణుడు అస్త్రం పట్టనని శపథం చేశాడుగద! అతను ఉంటే బాగుండేది, కాని లేడుగనక అర్జు నుణ్ణి చంపే మార్గం నువ్వే చూడు,'' అన్నాడు.

దుర్యోధనుడు ఇలా అనగానే భీష్ముడు రోతపడుతూ, ''ఛీ, ఛీ! ఏం క్షత్రియ ధర్మం!'' అని అర్జునుడి రథాన్ని సమీపించాడు. వెంటనే భీష్ముడికి అండగా కౌరవవీరులూ, అర్జునుడికి అండగా పాండవవీరులూ కూడారు. భీష్మార్జునుల మధ్య యుద్ధం ఆరంభమయింది. ఇద్దరూ మంచి యుద్ధో త్సాహంలో ఉన్నారు. ఒకరి బాణాల నుంచి మరొకరు తనను తాను కాపాడుకుంటూ ఇద్దరూ సమంగా యుద్ధం చేశారు. ఈ యుద్ధంలో ఇద్దరి రథాలూ, గుర్రాలూ, సార థులూ గాయపడ్డారు. కృష్ణుడికి మూడు బాణాలు తగిలి రక్తం కారసాగింది. భీష్ముడు చేసిన ఈ పనికి ఆగ్రహించి అర్జునుడు

భీష్ముడి సారథిని కూడా మూడు బాణాలతో కొట్టాడు. ఆ యుద్ధంలో భీష్ముడు అర్జునుణ్ణి గాని, అర్జునుడు భీష్ముణ్ణి గాని జయించ లేదు.

ఈ సమయంలో ఇతరద్వంద్వయుద్ధాలు సాగాయి. ద్రోణుడికీ, ధృష్టద్యుమ్నుడికీ ఘోరమైనయుద్ధం జరిగింది. ధృష్టద్యుమ్నుడి విజృంభణ చూసి పాండవ వీరులు ఉత్సాహంతో సింహనాదాలు చేశారు. కాని చివరకు ధృష్టద్యుమ్నుడు తన బాణాన్నీ, రథాన్నీ పోగొట్టుకుని, కవచం తూట్లుపడి ద్రోణుడి బాణాల తాకిడికి గురి అవుతూఉన్నస్థితిలో భీముడు సింహనాదం చేస్తూ వచ్చి అతన్ని కాపాడి, ద్రోణుడితో అతి భీకరంగా యుద్ధం ఆరంభించాడు.

దుర్యోధనుడు భీముడు పైకి కాళింగుణ్ణీ, అతనిసేననూ పంపాడు. ద్రోణుడు భీముణ్ణి వదిలి, విరాట ద్రుపదులతో యుద్ధం చేయబోయాడు. ధృష్టద్యుమ్నుడు ధర్మరాజు వద్దకు మరొక రథంలో వెళ్ళాడు. భీముడు తనపైకి వచ్చిన కాళింగుడి సేనలతో పోరాడి, కాళింగుడి కొడుకులైన శుక్రదేవుణ్ణీ, భానుమంతుణ్ణీ, శ్రుతాయుషుడనే కాళింగుణ్ణీ చంపి, కాళింగుడి సేన మధ్యపడి బీభత్సంగా చంపసాగాడు. అది చూసి ధృష్టద్యుమ్నుడు ఉత్సాహం పొంది, సింహనాదంచేసి, భీముడికి సహాయంగా వచ్చాడు. ఆ సమయంలో భీముడు యముడిలాగా ఉన్నాడుగాని మనిషిలాగా లేడు.

సేనలలో కోలాహలం విని భీష్ముడు వేగంగా అక్కడికి వచ్చాడు. ఆయన మీద సాత్యకీ, భీముడూ, ధృష్టద్యుమ్నుడూ కలియబడ్డారు. భీష్ముడు ముగ్గురితోనూ తీవ్రంగా యుద్ధం చేశాడు. భీముడి రథాశ్వాలు చచ్చాయి. భీముణ్ణి ధృష్టద్యుమ్నుడు తన రథం మీద ఎక్కించుకుని అవతలికి తీసుకుపోవలసి వచ్చింది. భీముడికి సంతోషం కలగగలందులకు సాత్యకి భీష్ముడి సారథిని తనబాణాలతో చంపేశాడు. గుర్రాలుభీష్ముడి రథాన్ని ఎటో ఈడ్చుకు పోయాయి.

తరవాత సాత్యకి భీముడి వద్దకు వచ్చి అతని భుజం తట్టి, "ఆహా, భీమసేనా! ఏమి నీ ప్రతాపం! కాళింగుణ్ణీ, అతని కొడుకులనూ నువ్వు ఒక్కడివే చంపావుగద. అది నీకే సాధ్యం!" అంటూ కౌగలించుకుని ప్రోత్సహించాడు.





# ప్రతిఫలం

వేనగిరిలో, వివేకాచార్యులకు వైద్యుడిగా మంచిపేరున్నది. ఎక్కడెక్కడి వాళ్ళూ ఆయన దగ్గరకువచ్చి, తమ శారీరక రుగ్మతలు తెలియజేసుకునేవారు. వాళ్ళను అనేక రకాలుగా ప్రశ్నించి, పరీక్షలు చేసి, వాళ్ళ రోగలక్షణాలను గ్రహించిన వివేకాచార్యులు, తగిన మందులిచ్చి వాళ్ళను ఆరోగ్యవంతుల్ని చేసేవాడు.

ఆయన రోజూ ఉదయం ఆరుగంటలు మొదలు, మధ్యాహ్నం ఒంటిగంటవరకు మాత్రమే రోగులను పరీక్షించేవాడు. ఆ తర్వాత, శిష్యులకు వైద్యశాస్త్ర బోధన చేసేవాడు.

వివేకచార్యుల వద్దకు వచ్చిన ప్రతిరోగీ వెళ్ళిపోయేముందు, ఆయన చెప్పినంత డబ్బు ప్రతిఫలంగా ఇచ్చి, ఆనందంగా వెళ్ళేవారు.

ఒకనాడు, ఆయన రోగుల్ని పరీక్షిస్తున్న సమయంలో, రామగిరినుంచి ఆయన బాల్య మిత్రుడు గోపాలస్వామి ఆయనను చూడడానికి వచ్చాడు. ఆచార్యులు, అతణ్ణి చిరునవ్వుతో ఆహ్వానించి, తన పక్కనే కూర్చోబెట్టుకున్నాడు.

ఆ సమయంలో ఆయన, రోగిని పరీక్షించిన అనంతరం, అతడికి మందులు పొట్లంలో కట్టియిచ్చి, ఎలా వేసుకోవాలో వివరంగా చెప్పి, ''రాత్రిభోజనంగా ఏమేం తిన్నావు?'' అని ప్రశ్నించాడు.

''అయ్యా, రాత్రి గంజి అన్నం ఉల్లిపాయ ముక్కలతో తిన్నాను,'' అని చెప్పాడు రోగి.

''సరే, రెండువరహాలు చెల్లించి వెళ్ళు,'' అన్నాడు వివేకాచార్యులు.

ఆ రోగి రొండినుంచి, చిన్న సంచీతీసి, అందులోంచి రెండు వరహాలు ఆచార్యులకిచ్చి, నమస్కరించి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత మరొక రోగిని కూడా నిదానంగా పరీక్షించి, మందుపొట్లం కట్టి యిచ్చి, ''రాత్రి

కోనే నాగవెంకట ఆంజనేయులు

ఏం తిన్నావు ?''అని అడిగాడు వివేకా చార్యులు.

''పప్పు, కాయగూరలతో భోజనంచేసి పాయసం తాగాను. ఆతర్వాతపడుకోబోయే ముందు, ఒక మామిడి పండు తిన్నాను,'' అన్నాడు రోగి.

''అలాగా! పది వరహాలు చెల్లించి వెళ్ళు,'' అన్నాడు ఆచార్యులు.

ఆ రోగి వెళ్ళగానే, ఆయన మరొకరోగిని కూడా పరీక్షించి, మందులు ఇచ్చిన తర్వాత, అంతకు ముందు వాళ్ళను అడిగినట్టుగానే, రాత్రి ఏం తిన్నావని అడిగాడు.

''రాత్రి మేటుమాంసంకూర, చేపలపులుసు రొయ్యలవేపుడుతో భోజనం ముగించాను. ఆ తరవాత మధుర పదార్థాలు కొన్ని భుజించాను,'' అన్నాడు రోగి.

''ఓహోం, అలాగా! ఇరవై వరహాలు చెల్లించి వెళ్ళండి!''అన్నాడు వివేకాచార్యులు.

రోగి ఇరవైవరహాలు చెల్లించి వెళ్ళాడు.

ఆచార్యుల పక్కనే కూర్చుని వున్న, ఆయన మిత్రుడు ఇదంతాశ్రద్ధగాగమనిస్తున్నాడు. వివేకాచార్యులు, రోగిని పరీక్షించే విధానం, రోగుల్ని ప్రశ్నించి సమాధానాలు రాబట్టుకుని, రోగ నిర్ధారణ చేసే పద్ధతీ, ఎంతో గొప్పగా తోచింది ఆయనకు. అయితే, మందులు యిచ్చి పంపించేముందు, ఆచార్యులు, ప్రతిరోగినీ రాత్రి ఏం తిన్నావని అడగడం వింతగా తోచింది.

రోగులందరూ వెళ్ళిపోయేవరకూ, ఈ విషయాన్ని గురించే ఆలోచిస్తున్నగోపాల స్వామి ఆయనను దీన్ని గురించిప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు వివేకాచార్యులు చిన్నగా నవ్వి, ''మరేంలేదు! రాత్రి ఆ రోగులు ఏం తిన్నారో తెలుసుకుని, వాళ్ళ ఆర్థిక పరిస్థితి ఏమిటో గ్రహిస్తాను. ఆ తరవాత వాళ్ళకు ఇబ్బంది కలగకుండా, ప్రతిఫలం ఎంత తీసుకోవచ్చునో నిర్ణయిస్తాను. అదీ అసలు సంగతి!'' అన్నాడు.

ఇది విన్న గోపాలస్వామి, తన మిత్రుడు అంతగా లేనివాళ్ళ దగ్గర తక్కువ ప్రతిఫలం తీసుకుంటూ, వాళ్ళపట్ల చూపుతూన్న ఔదార్యానికి ఎంతో సంతోషించాడు.






# పిసినిగొట్టు

ఒక గ్రామంలో కుమరప్ప అనేవాడు ఉండేవాడు. అతను తన గ్రామానికి సమీపంలోనే ఉండే నగరంలో వ్యాపారం చేసేవాడు. అతనిలో డబ్బు కూడబెట్టే గుణం ఉన్నది గాని, ఖర్చు చేసే గుణం లేదు. అతను పెళ్ళి చేసుకున్నాక నగరంలోనే కాపరం పెడదామా అని అనుకున్నాడు గాని, నగరంలో ఖర్చు జాస్తి అవుతుందనుకుని, తన ఊళ్ళోనే కాపరం పెట్టి, వ్యాపారం నిమిత్తం రోజూ నగరానికి వస్తూ పోతూ ఉండేవాడు.

కుమరప్ప తన భార్య అయిన వెంకటలక్ష్మికి పొదుపు బోధించేవాడు. ఆకలితీరటానికి తిండి తినాలిగాని, జిహ్వాచాపల్యం కొద్దీ తినరాదనేవాడు.

అయితే కుమరప్ప భార్య ఇంత కలిగిన ఇంటిపిల్ల. ఆమె తన పుట్టింట అన్ని రకాల రుచులూ ఎరిగిన మనిషి. భర్తకు జంకి పేదగా తినటం మూలాన ఆమెకు నోరు చవి చచ్చినట్టయింది. అయినా భర్తకు భయపడి కొన్నాళ్ళు నోరు కట్టేసుకున్నది.

కొంతకాలం చూసి ఆమె, భర్త నగరానికి బయలుదేరి వెళ్ళాక, తనకు ఇష్టమైనవి చేసుకుని తినటమూ, ఆ తరవాత అవి చేసిన ఆనవాలు లేకుండా చెయ్యటమూ సాగించింది.

ఒకనాడు కుమరప్ప నగరం నుంచి బాగా చీకటిపడి తన గ్రామానికి తిరిగివస్తూ, తన పొరుగున ఉన్న ఇంటివాడు పలకరించేసరికి ఆగాడు. ''ఇవాళ మా ఇంట్లో పూజ చేశాం. ప్రసాదం తినిపో. నీభార్య చేసే వంటకాలంత బాగుండవేమో!'' అన్నాడు, పొరుగింటివాడు, రెండుగారెలు తెచ్చి ఇచ్చి.

''నా భార్యకు మామూలు వంట తప్ప, పిండివంటలు చెయ్యటం రాదే!'' అన్నాడు కుమరప్ప ఆశ్చర్యంగా.

''అదేమిటయ్యా? నీభార్యకు రాని పిండి వంట ఉన్నదా? రోజూ మాకు రకరకాల పిండివంటల వాసన వస్తుందిగదు. నాభార్యకు అలాటి వాసనతెప్పించటంకూడాచేతకాదు. గారెలూ, పెసరట్లూ, బజ్జీలూ నీభార్యదగ్గిర

నేర్చుకోమని నాభార్యకు చెప్పాను,'' అన్నాడు పొరుగింటివాడు.

''అలాగా?'' అంటూ కుమరప్ప తన ఇంటికి వచ్చేశాడు.

అతనికి తన భార్యను గురించి అనుమానం పట్టుకున్నది. కాని అతను తన భార్యను ఏమీ అడగలేదు. తానే స్వయంగా అనుమానం తీర్చుకోవాలని నిశ్చయించుకున్నాడు.

అందుచేత, మర్నాడు అతను నగరానికి బయలుదేరినట్టు బయలుదేరి, కొంత దూరం వెళ్ళి తిరిగి వచ్చి, దొడ్డి దారిన లోపల ప్రవేశించి, చప్పుడు చేయకుండా ఒక చీకటి మూల దాక్కున్నాడు.

ఆ రోజు వెంకటలక్ష్మి పెసరపప్పు వేయించి పాయసం చేసింది. కొంచెం బియ్యం నాన బోసిరుబ్బి, బెల్లమూ, కొబ్బరీ, యాలకులూ చేర్చి అప్పం చేసింది. వీధిన చెరుకు గడలుఅమ్ముతుంటేఒకగడ కొన్నది. అప్పాలు తిని, పాయసం తాగి, చెరుకుగడ తరిగి ముక్కలు చేసి, అన్నీ తినేసింది. తరవాత పిప్పి అంతా జాగ్రత్తగా పోగుచేసి, దూరంగా పారేసి వచ్చి, గిన్నెలూ, రోలూ శుభ్రంగా కడిగి తాను పిండి వంటలు తిన్నఆనవాలుఏ మాత్రమూ లేకుండా చేసింది. ఆమె ఈ పనులలో నిమగ్నురాలై ఉండగా కుమరప్ప బయటికి జారుకుని, తన కాలికి ఒక గుడ్డ కట్టుకుని, కుంటుకుంటూ ఇల్లు చేరాడు. భర్తను చూడగానే వెంకటలక్ష్మి ఆదుర్దాగా, ''కాలికి ఏమయిందండి?'' అని అడిగింది.

''ఏం కావాలి? పాము కరి చింది,'' అన్నాడు కుమరప్ప.

''పాము కరిచిందా? పెద్ద పామే?'' అన్నది భార్య.

''పెద్దదే! నువ్వు తిన్న చెరుకుగడంత పెద్దది! నువ్వు తిన్న అప్పం లాగా కాలు పొంగింది! నువ్వు తాగిన పాయసం లాగా నా నోట నురుగులు వచ్చాయి,'' అన్నాడు కుమరప్ప.

వెంకటలక్ష్మి తన రహస్యం బయట పడిందని చాలా భయపడింది. కాని కుమరప్ప నవ్వుతూ, ''భయపడకు. పొరపాటు నాదే! కడుపు కింత తినకుండా నోరు కట్టుకుని ఏం లాభం? ఇకనుంచీ నాకూడా రోజూ పిండి వంటలు చెయ్యి. హాయిగా తింటాను,'' అన్నాడు.



# పరోపకారి చిన్నడు

ఇదొక చందమామ కానుక!

చిత్రాలు : పాణి






పాడుపడిన పురాతన రాజభవనంలో దయ్యాలు చేరాయనీ, దొంగలబెడద ఎక్కువయిందనీ అందరూ భయపడసాగారు. ఆ సమయంలో చిన్నడు తన కుక్కతో సహా ఆ ఊరు వచ్చి, వారికి ఉపకారం చేయాలని దయ్యాల ఇంటనే మకాం పెట్టాడు.









చిన్నడు రాత్రంతా తన కుక్కతో గస్తీ తిరుగుతూ, కనిపించిన వాడినల్లా తీసుకుపోయి, దయ్యాల భవనంలో వుంచి, తెల్లవారాక విడిచి పెట్టసాగాడు.




కొన్ని రోజులకు దయ్యాల భయం తగ్గింది. కాని చిన్నడు అడ్డమైన వాళ్ళందరినీ దొంగలుగా అనుమా నించి పట్టుకుంటు న్నాడని కొందరు గ్రామాధికారికి ఫిర్యాదు చేశారు.


"ఏమిటి అందర్నీ అనుమా నించి బంధిస్తున్నా వట?"
"అవును. రాత్రంతా దయ్యాల భవనంలో గడిపితే దయ్యాల భయం పోతుంది. అది పోతే దొంగల బెడద మటుమాయ మవు తుంది."


కొన్నాళ్ళకు నిజంగానే దొంగల బెడద కూడా పోయింది. చిన్నడి యుక్తిని మెచ్చుకుని గ్రామాధికారి అతన్ని అందరి ముందూ సత్కరించాడు.


"బాబూ! కన్నపు దొంగల్ని లేకుండా చేశావు. మరి, ఘరానా దొంగల్ని ఏమీ చేయలేవా?"
"ఎవరా ఘరానా దొంగలు?"


మా తండ్రి గోపన్న చనిపోతూ, "నేను కరణం దగ్గర నాలుగువేలు అప్పు చేసి పత్రం రాసిచ్చాను. బాకీ తీర్చేశాను గాని, ఆయన పత్రం తిరిగి ఇవ్వలేదు. దానిని తీసు కోండి!" అని చెప్పాడు.


"మాతండ్రి చెప్పినట్టు వెళ్ళి కరణం గారిని అడిగాము. ఆయన పత్రం ఇవ్వ లేదు. మా ఇల్లు ఆక్రమించు కుని మాకు నిలువ నీడ లేకుండా చేశాడు.
"నిజానిజాలు తెలుసుకుని కరణం సంగతి చూస్తాను"


చిన్నడు ఆ రాత్రి గస్తీ తిరిగేప్పుడు కరణం గారి ఇంటి గోడకు ఒక కన్నం పెట్టి వదిలేశాడు.


మరునాడు చిన్నడు గ్రామాధికారి ఇంటికి వెళ్ళి కరణంగారిని పిలిపించమన్నాడు.


"బాబూ! నువ్వు దొంగల బాధ లేకుండా చేశావంటారు. మరి మా ఇంటి గోడకు రాత్రి ఎవరో కన్నం వేశారు!"
అది మనుషుల పనికాదు; దయ్యాలపని అయివుంటుంది!"


"దయ్యాల పనా? అది నీకెలా తెలుసు?"
"నేనుండేది దయ్యాలకొంపలోనే కదా? అవునూ, గోపన్న దయ్యం మిమ్మల్ని ఒకసారి రమ్మన్నది. వస్తారా?"


"అమ్మో! చచ్చినా అటువైపు రాను. గోపన్న మా ఇంటికి కన్నం వేసి ఉంటాడు."
"వెళ్ళిరండి కరణం గారూ! దయ్యాలతో మాట్లాడే అవకాశం పోగొట్టుకోకండి!"


"అది తలుచుకుంటేనే గుండె దడదడలాడుతోంది!"


"అసలు గోపన్నకు మీమీద ఎందుకు కోపం?"


వాడు నాదగ్గర అప్పుచేసి తీర్చేశాడు. కాని నేను వాడు రాసిచ్చిన పత్రాన్ని తిరిగి ఇవ్వకుండా, వాడి ఇల్లు కూడా స్వాధీనం చేసుకున్నాను. వాడు పగపట్టినట్టున్నాడు.
"అలాగా! ఆ ఇల్లు వాడి పిల్లలకు తిరిగి ఇచ్చేసి, పరిహారం కింద వెయ్యి రూపాయలు ఇచ్చుకోండి. మీ జోలికి రావద్దని గోపన్న దయ్యానికి చెబుతాను."


కరణం, చిన్నడు చెప్పినట్టే పత్రాన్ని గ్రామాధికారికి ఇచ్చి, ఇంటిని గోపన్న పిల్లల పరం చేసి, వెయ్యి రూపాయలు చెల్లించాడు.


చిన్నడు మరునాడే తన కుక్కతో సహా రామాపురం వదిలి మరో ఊరికి బయలు దేరాడు.



# చందమామ

## భారత దర్శనం పాఠకులకు క్విజ్

ఈ సంచికలోని ప్రశ్నలకు సమాధానాలు వచ్చే సంచికలో ప్రచురిస్తాం. ఈలోగా వాటి సమాధానాలు తెలుసుకోగలరేమో ప్రయత్నించి చూడండి.

1



1. ఎ) సమకాలీనులైన ఇద్దరు గొప్ప ప్రవక్తలు ఎవరు? ఆ ఇద్దరిలో రాజ కుటుంబానికి చెందిన వారెవరు?

బి) తొలి బౌద్ధ గ్రంథాలు ఏ భాషలో రచింపబడ్డాయి?

సి) అతి ప్రాచీనమైన బౌద్ధమత గ్రంథం ఏది?

డి) తొలి జైన గ్రంథాలను ఏ భాషలో రచించారు?

ఇ) అతి ప్రాచీనమైన జైనగ్రంథాల పేర్లు ఏమిటి?

2

సుప్రసిద్ధుడైన ఒక రాజు పరివారంతో వేటకు వెళ్ళాడు. ఆయన ఒక మృగాన్ని బాణంతో కొట్టినప్పుడు దాని రక్తం ఆయన వస్త్రంపై పడింది. ఆయన ఆ వస్త్రాన్ని విప్పి భటుడి చేతికిచ్చి, దానిని తీసుకుపోయి రాజభవనంలోని రాణీగారి ముందు ఉంచమన్నాడు. అయితే, దానిని గురించి ఏమీ చెప్పవద్దని భటుణ్ణి ఆజ్ఞాపించాడు. నెత్తురుతో తడిసిన తన భర్త వస్త్రాన్ని చూసి రాణి ఎలా స్పందిస్తుందో తెలుసుకోవాలన్నది రాజు కోరిక. నవ్వులాటకు చేసిన ఈ ప్రయోగం ప్రమాదంలో ముంచింది.

రాజు రాజభవనానికి తిరిగి వెళ్ళేలోగానే రాణి, రాజు మరణించాడన్న బాధ తట్టుకోలేక మరణించింది!

ఆ రాజు పేరేమిటి? రాణి ఎవరు?



## సృజనాత్మక పోటీలు

సాధారణ ప్రచురణకు ఎంపికయిన ఏప్రిల్‌నెల సామెత (చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్టు) కథ

# దొంగకు ఆశ్రయం!

శిర్ళంగేరి గ్రామంలో బంగారుశెట్టి అనే వర్తకుడు ఉండేవాడు. ఒకనాటి అర్ధరాత్రి వేళ అతడు నిద్రపోతూన్నప్పుడు ఎవరో తలుపుతట్టిన శబ్దమయింది. లేచి తలుపు తెరిచాడు.

చేతిలో సంచితో ఒక మనిషి లోపలికి వచ్చి వెంటనే తలుపుమూసి, అతని కాళ్ళపై బడి, ''అయ్యా, రక్షించండి! ఆపదలో ఉన్నాను. నన్ను జమీందారు భటులు తరుముకుని వస్తున్నారు. నేను దొంగతనం చేసి పరిగెత్తుకురావడం వాళ్ళు పసిగట్టారు. పట్టుబడ్డానంటే యావజ్జీవ శిక్ష తప్పదు. ఆశ్రయం ఇచ్చి నన్ను కాపాడావంటే ఈ సంచీలోవున్న నగలన్నీ నీకే ఇచ్చి వెళతాను,''అన్నాడు.

బంగారుశెట్టి ఒక్క నిమిషం ఆలోచించి,'సరే' అని చెప్పి బయటకు వెళ్ళి తలుపుమూశాడు.

జమీందారు భటులు వచ్చి దొంగను గురించి విచారించారు. ఇటువైపు ఎవరూ రాలేదని చెప్పి పంపేసి బంగారుశెట్టి లోపలికి వచ్చాడు.

పరిస్థితిని గ్రహించిన దొంగ, కత్తిని తీసి బంగారుశెట్టికి గురిపెడుతూ,''ఇంట్లో దాచిన నగలూ, డబ్బూ పట్టుకురా!''అని గద్దించాడు.

ఒక్కక్షణం బంగారుశెట్టి నోట మాట రాలేదు. ''నీకు చేసిన ఉపకారానికి నువ్వు చేసే ప్రత్యుపకారం ఇదా?''అని వాపోయాడు.

''దొంగనని తెలిసీ, నాకు ఆశ్రయం ఇచ్చిన నువ్వు, న్యాయాన్యాయాల గురించి మాట్లాడుతున్నావా? మర్యాదగా నగలు తియ్యి. లేదా ప్రాణాలు దక్కవు!''అన్నాడు దొంగ కత్తిని మరింత దగ్గరికి చూపుతూ.

ప్రాణభయంతో వణికిపోతూ దాచిపెట్టిన నగలూ , రొక్కమూ తెచ్చి దొంగ చేతికిచ్చాడు శెట్టి.

దొంగ, శెట్టిని ఒక గుంజకు కట్టేసి, ''నేను వెళ్ళేలోగా అరిచి ఎవర్నయినా పిలవాలని ప్రయత్నించావో, నీ గతి అంతే!''అని హెచ్చరించి వెళ్ళిపోయాడు.

తెల్లవారింది. జమీందారు ఇంట్లో దొంగతనం చేసిన దొంగ ఆచూకీ తెలియజేసిన వారికి వెయ్యి బంగారు నాణాలు బహుమతి ఇస్తామని జమీందారు భటులు చాటింపు వేయడం విని, బంగారుశెట్టి వెలవెలపోయాడు.

తాను ఒక బాధ్యతాయుతమైన పౌరుడిగా ప్రవర్తించి ఉన్నట్టయితే; తన నగలూ, డబ్బూ పోయేవికావు. జమీందారు బహుమతీ లభించి ఉండేది. ఇప్పుడు అంతా చేయిదాటి పోయింది. దురాశ చేతులు కాల్చేసింది. ఇప్పుడు లేనిపోని ఆలోచనలతో ఆకులు పట్టుకోవడం వల్ల ప్రయోజనం ఏమిటి? అని బంగారుశెట్టి మౌనంగా బాధపడసాగాడు.

- కోలార్ కృష్ణ అయ్యర్





# భారతదేశం:

## నాడు-నేడు

# పూరీ

### జగన్నాధమందిరం వెలసిన ప్రాచీన నగరం!

**తూ**ర్పు సముద్ర తీరంలోని ఒరిస్సా రాష్ట్రంలో ఉన్న పూరీ మనదేశంలోని అతి ప్రాచీన నగరాలలో ఒకటి. ఇక్కడున్న సుప్రసిద్ధ పురాతన దేవాలయంలో- జగన్నాధుడు, (శ్రీకృష్ణుడు) ఆయన అన్న బలభద్రుడు, సోదరి సుభద్ర విగ్రహాలు ఉన్నాయి. ప్రస్తుతం వున్న దేవాలయాన్ని చోడగంగదేవుడు పన్నెండవ శతాబ్దంలోనే నిర్మించినప్పటికీ, అంతకు పూర్వం నుంచే ఇక్కడ మరెన్నో దేవాలయాలు ఉండేవని చెబుతారు.

ఈ ఆలయంలోని జగన్నాధుడి కొయ్య విగ్రహం లోపల ఏదో నిగూఢమైన వస్తువు దాచబడివుందనీ, అది పన్నెండేళ్ళ కొకసారి పాత విగ్రహం నుంచి కొత్త విగ్రహంలోకి మార్చబడుతుందనీ చెబుతారు. అది మరేదోకాదు;సాక్షాత్తు శ్రీకృష్ణ భగవానుడి అవశేషాలేనని భక్తుల విశ్వాసం!

మొదట ఆ అవశేషాలు నిండిన పెట్టెను విశ్వావసు అనే కోయరాజు పూజించేవాడు. శ్రీకృష్ణుడని తెలియక బాణంతో కొట్టి, శ్రీకృష్ణనిర్యాణానికి కారణమైన జరాశబరుడి వంశానికి చెందినవాడే విశ్వావసు అని అంటారు.

ఒకానొకప్పుడు పూరీని పరిపాలించిన ఇంద్రద్యుమ్నుడనే రాజుకు శ్రీకృష్ణుడి అవశేషాలు ఆ పరిసరారణ్య ప్రాంతంలోనే ఉన్నవి అన్న భావం కలిగింది. వాటిని వెదికితెమ్మని వివేకవంతులైన

నలుగురు యువకులను నాలుగు దిశలకు పంపాడు.

వారిలో ఒకడైన విద్యాపతి తూర్పు దిక్కుగా వెళ్ళి, విశ్వావసు ఇంట అతిథిగా చేరాడు. కొన్ని రోజులకు విశ్వావసుకూతురు లలిత, అతడు ఒకరినొకరు ప్రేమించిపెళ్ళి చేసుకున్నారు. విశ్వావసు రోజూ తెల్లవారక ముందే లేచి ఎక్కడికో వెళ్ళి దేనినో పూజించి రావడం విద్యాపతి గమనించాడు. అతడు అది ఏమిటో చూడాలని పట్టు బట్టాడు. అల్లుడి కళ్ళకు అడ్డుగా గంతలు కట్టి విశ్వావసు తన వెంట తీసుకువెళ్ళాడు. అయితే, విద్యాపతి తనతో ఆవాలు తీసుకుని దారి పొడవునా రహస్యంగా రాల్చుకుంటూ వెళ్ళాడు.

గుహలోకి చేరగానే తాను దివ్య అవశేషాల సమక్షంలో ఉన్నట్టు విద్యాపతి గ్రహించాడు. ఇద్దరూ ఇంటికి తిరిగివచ్చారు.

కొన్ని రోజులలో ఆవగింజలు మొలకెత్తాయి. విద్యాపతి వాటి సాయంతో దారి వెతుక్కుంటూ రహస్యగుహలో ప్రవేశించి, అక్కడి దివ్య అవశేషాలను తీసుకుని రాజధాని చేరుకున్నాడు.

వాటిని చూసి రాజు ఇంద్రద్యుమ్నుడు పరమానందం చెందాడు. స్వయంగా అరణ్యానికి వెళ్ళి విశ్వావసుకు క్షమాపణలు చెప్పుకున్నాడు. ఆ దివ్య అవశేషాలు భక్తులందరికీ దర్శనమిచ్చే సమయం ఆసన్నమయిందని ఆయనకు నచ్చజెప్పాడు.

విద్యాపతి-లలితసంతతి వారే ఈనాటికీ ఆలయ పూజారులుగా ఉండడం చెప్పుకోతగ్గ విశేషం. విద్యాపతి బ్రాహ్మణుడు. లలిత కోయ జాతికి చెందినది. కాబట్టి ఆ రోజుల్లో కుల సంబంధమైన పట్టింపులు, నిషేధాలు లేవని తెలుస్తున్నది.



ఈనెలలోనే జగన్నాథ రథోత్సవాలు జరుగుతాయి. బృందావనం నుంచి శ్రీకృష్ణుడు మధురకు తరలి వెళ్ళిన సందర్భానికి గుర్తుగా రథోత్సవం జరుపుతారు. ఈ ఉత్సవానికి వేలాది భక్తులు పూరీని చేరుకుంటారు.

ప్రాచీనయుగానికీ-ఆధునిక కాలానికీ మధ్య ఉన్న అంతరం చాలా తగ్గిపోవడం ఇప్పుడు స్పష్టంగా కనిపిస్తుంది. అయితే జగన్నాథ దేవాలయంలో ఇచ్చే ప్రసాదం కనీసం వెయ్యేళ్ళకు పూర్వం నాటి ప్రజల తినుబండారం లాంటిదే అయివుండడం విశేషం!

పూరీలో జగన్నాథ మందిరంతో పాటు మరి కొన్ని ఆలయాలు కూడా ఉన్నాయి. అయినా, ఇక్కడ ఆధునిక సదుపాయాలకు కూడా కొదువ లేదు. సముద్రతీరంలో సాయంకాలం విలాసంగా నడిచి వెళ్ళే జనం కన్నులపండుగ చేస్తారు. రోజూ వేలాదిమంది యాత్రికులు సముద్రస్నానం చేస్తారు.

ఆధునిక పూరీనగరంలో-సంస్కృతభాషాభివృద్ధికి కృషిచేస్తున్న పెద్ద సంస్కృత విద్యాసంస్థ; ప్రాచీన భారతీయ వైద్యశాస్త్రమయిన ఆయుర్వేదంలో పరిశోధనలు జరిపే ఆయుర్వేద విద్యా కేంద్రం ఉన్నాయి.

# శ్రీలంకలో

శ్రీలంక చరిత్రను తెలియజేసే మహావంశం, అనే ప్రాచీన గ్రంథం–తూర్పుభారత దేశానికి చెందిన విజయసింహుడనే యువరాజు ఐదువందల మంది సైనికులతో ఆ ద్వీపానికి చేరుకున్నాడని తెలియజేస్తుంది. అతడు స్థానికులైన కొండతెగల వారిని అడవులలోకి తరుమగొట్టి వాళ్ళ నివాస ప్రాంతాలను ఆక్రమించుకున్నాడు. ఆ తరవాత ద్వీపానికి సమీపంలోని మదురై నుంచి కన్యలను తెచ్చి తన సైనికులకు వివాహం జరిపించాడు. వారి సంతతికి చెందిన వారే ఈనాటి సింహళ దేశస్థులు అని అంటారు. విజయసింహుడి పేరు మీదుగానే



## వార్తలు విశేషాలు

ఈ ద్వీపానికి సింహళమనే పేరు వచ్చింది. అశోక చక్రవర్తి కుమారుడు మహేంద్రుడు, కుమార్తె సంఘమిత్ర అక్కడికి వెళ్ళి రాజకుటుంబం, ప్రజలు బౌద్ధమతాన్ని స్వీకరించేలా చేశారు.

ఆ తరవాత దక్షిణ భారతదేశంనుంచి, అంటే తమిళ ప్రాంతంనుంచి పలువురు వర్తకులూ, ఇతరులూ క్రమంగా ఉత్తర శ్రీలంకలో స్థిరపడ్డారు. దానినే జాఫ్నా ద్వీపకల్పం అని అంటారు.

శ్రీలంకలోని సింహళులూ, తమిళులూ, భారతీయ సంతతికి చెందినవారే అయినప్పటికీ అల్ప సంఖ్యాకులైన తమిళులు అధిక సంఖ్యాకులైన సింహళుల చేత అనేక అన్యాయాలకు గురవుతూ వచ్చారు. చాలాకాలం తరవాత తమిళుల హక్కుల కోసం పోరాడడానికి తమిళ్ యునైటెడ్ లిబరేషన్ ఫ్రంట్ (టి.యు.ఎల్.ఎఫ్.) అనే సంస్థను ఏర్పాటు చేసుకున్నారు. ఆ తరవాత మరికొన్ని సంస్థలు ఏర్పడ్డాయి. వాటిలో ప్రధానమైనదీ, హింసా మార్గంలో పోరాడుతున్నదీ 'లిబరేషన్ టైగర్స్ ఆఫ్ తమిళ్ ఈళం' అనే ఎల్.టి.టి. ఇ. శ్రీలంక నుంచి తమిళ్ ఈళం (జాఫ్నా) విడిపోవాలన్న లక్ష్యంతో అది పోరాడుతున్నది.

ఎల్.టి.టి.ఇ. ఆవిర్భావంతో తమిళుల ఉద్యమం కొత్త మలుపు తిరిగింది. తమిళుల హక్కుల పరిరక్షణకూ, రక్షణకూ తమను ఏకైక



# మళ్ళీ సంక్షోభం

సంస్థగా భావిస్తూ ఎల్.టి.టి. ఇ. తమ అభి ప్రాయంతో విభేదించే నాయకులను హతమార్చసాగింది. తమిళ ప్రజల హక్కుల కోసం చిత్తశుద్ధితో పోరాడిన పలువురు నాయకులను హత మార్చిన ఎల్.టి.టి. ఇ. ఆఖరికి భారత ప్రధాని రాజీవ్‌గాంధీని కూడా వదిలి పెట్టలేదు. ఆ తరవాత కూడా ఎల్.టి.టి. ఇ. శ్రీలంక సైన్యం మధ్య ఎడతెగని పోరు కొనసాగుతూనే ఉన్నది. అందువల్ల సామాన్య ప్రజలు నానాయాతనలకు గురవుతున్నారు. దేశ ఆర్థిక స్థితి కూడా దిగ జారి పోయింది. వేలాదిమంది జాఫ్నా తమిళులు భారత్‌కు శరణార్థులుగా వచ్చారు. ఇప్పుడు జాఫ్నా ద్వీపకల్పంలోని శ్రీలంక సైన్యాన్ని చుట్టుముట్టి, తమిళ పులులు జాఫ్నాను పట్టుకునే పరిస్థితి ఏర్పడడంతో ఘర్షణ మరీ ఎక్కువై మళ్ళీ సంక్షోభం ఏర్పడింది.

శ్రీలంక తమిళుల పట్ల భారత్ ఎప్పుడూ సాను భూతితోనే వ్యవహరిస్తున్నది. అయినా శ్రీలంక విభజనకు సుముఖంగా లేదు.

విభజన, సమస్యలకు పరిష్కారం కాదు— అన్నది భారత్‌కు స్వానుభవంతో తెలిసిన విషయమే. భారత్ విభజన వల్ల ఇటు భారత్‌కు గాని, అటు పాకిస్తాన్‌కు గాని ఎలాంటి మేలూ జరగలేదు సరికదా, ఉభయ దేశాల మధ్య అసంతృప్తి, స్పర్థలు ఈనాటికీ సాగుతూనే ఉన్నాయి. అందువల్లే, శ్రీలంక సమగ్రతకు భంగం రాకుండా తమిళుల సమస్యలను పరి ష్కరించుకోవాలని భారత్ భావిస్తోంది.

మరొక విషయం ఏమంటే, ప్రజాస్వామ్యం పట్లవిశ్వాసం వున్న ఏదేశమైనా సరే ఎల్.టి.టి.ఇ. హింసామార్గాన్ని అంగీకరించదు. ప్రజల గౌర వాదరాలను చూరగొన్న తమిళనాయకులను హతమార్చడం ఏమాత్రం నాగరికచర్య అని పించుకోదు. హింసామార్గాన్ని ప్రతి ఒక్కరూ నిరసిస్తారు. పరస్పర చర్చల ద్వారా, సరైన అవ గాహన ద్వారా శాశ్వత పరిష్కారాన్ని సాధించాలి. హింసను జయించడానికి పరస్పర సుహృద్భావ వాతావరణం ఏర్పడాలని భారత్‌తో సహా యావత్ ప్రపంచం ఆశిస్తున్నది.

# ఫోటో
## వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



ఫోటో వ్యాఖ్యల పోటీ
చందమామ,
వడపళని
చెన్నయ్-600026





వ్యాఖ్యలను పోస్ట్ కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు సెప్టెంబర్ 2000 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

## అభినందనలు



మే 2000 నెల సంచికలో
బహుమతి పొందిన వ్యాఖ్యలు
పంపినవారు:
వక్కలంక రామారావు
3-3-113, ప్రకాశం వీధి,
అమలాపురం- 533 201
తూ.గో. జిల్లా ( ఆం.ప్ర)



మొదటి ఫోటో: కంగారు పడకే మేషం! రెండవ ఫోటో: కేవలమిది పులివేషం!

# Invest in a happy future

and

# reap a rich dividend of heritage

*The ideal growth scheme for the Indian child*

Gift a lifetime subscription of Chandamama, India's oldest and best-loved children's magazine.

Chandamama is available in 12 languages.

More details in the next issue



